12.5.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:19 విడిప్రతి:రూ.2.00లు

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవనదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



హరికృష్ణ అంతు చూస్తానని పార్వతి శపథం!

# శృతిమించిన ఇంటి పోరు!

ఎన్టీఆర్ రాజకీయ వారసత్వం కోసం లక్ష్మీపార్వతి, హరికృష్ణల మధ్య బహిరంగ యుద్ధం జరుగుతోంది. గతంలో వారసత్వం కోసం ఎన్టీఆర్ అల్లుళ్లు చంద్రబాబు నాయుడు, డాక్టర్ దగ్గుబాటి వెంకటేశ్వర రావు మధ్య కోల్డ్ వార్ జరిగేది. అల్లుళ్ల మధ్య ఎన్ని విభేదాలున్నప్పటికీ బయటపడి కొట్టుకునే వారు కారు. అయితే ఇందుకు భిన్నంగా లక్ష్మీపార్వతి, హరికృష్ణ రచ్చకెక్కి నువ్వెంత అంటే నువ్వెంత అనే దాకా వచ్చారు. ఎన్టీఆర్ కుటుంబంలో హరికృష్ణ రఫ్‌గా వుంటాడు. ఆయన మాటా, చేష్టా, ప్రవర్తన అన్నీ ఎన్టీఆర్‌ను పోలి వుంటాయి. కుటుంబ సభ్యుల్లో హరికృష్ణ అంటే ఎన్టీఆర్ అంతటి వాడికే దడపుట్టుందట. అందుకే లక్ష్మీపార్వతికి టెక్కలి టిక్కెట్టు ఇవ్వాలని ఎన్టీఆర్

> ఎన్టీఆర్‌ముందే పినతల్లి చెంపచెళ్ళుమన్నది;
> చంద్రబాబు యమ హ్యాపీగా వున్నాడు;
> పెద్దల్లుడు మౌనవ్రతమాచరిస్తున్నాడు!

ముచ్చట పడుతున్న తరుణంలో ఆయన కుటుంబ సభ్యులంతా కలిసి హరికృష్ణను పోటీగా రంగంలోకి దించారు. కుటుంబ సభ్యుల పథకం పారి టెక్కలి టిక్కెట్టు పార్వతికి దక్కకుండా పోయిన సంగతి తెలిసిందే.

ఇటీవల హరికృష్ణ గురించి లక్ష్మీపార్వతి చేసిన వ్యాఖ్యలు హరికృష్ణకు కోపం తెప్పించాయి. దానితో వెళ్ళిపోయిన హరికృష్ణ ఎన్టీఆర్ ఇంటికి వెళ్లి సాక్షాత్తు రామారావు ముందే లక్ష్మీపార్వతి పై చేయి చేసుకున్నాడట. ఎన్టీఆర్ వద్దని వారిస్తున్నా హరికృష్ణ ససేమిరా వినకుండా లక్ష్మీపార్వతి పై తన కోపం తీర్చుకున్నారు. ఈ సంఘటన జరిగాకే టెక్కలి టిక్కెట్టు పై ఎన్టీఆర్ తన అభిప్రాయం మార్చుకొని స్థానికుడైన అప్పయ్య దొరకు టిక్కెట్టు ఇచ్చారు.

టెక్కలి టిక్కెట్టు దక్కక పోగా ఒళ్లు హూనం చేసిన హరికృష్ణ పై లక్ష్మీపార్వతి నిప్పులు చెరుగుతోంది. తనను కలిసేందుకు వచ్చిన వారితో హరికృష్ణ సంగతి తేలుస్తానని పళ్లు కొరుకుతోందట. ఈ నేపథ్యంలో ఆంధ్రజ్యోతి పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో లక్ష్మీపార్వతి ఒక అడుగు ముందు కేసి ఎన్టీఆర్‌ను సిఎంను చేసింది తానేనని, తనవల్లే రామారావు ఈనాడు అధికార పీఠం పై కూర్చొని వున్నారని

హరికృష్ణ స్పీడుకు జయకృష్ణ బ్రేకులు?

ప్రకటించింది. అంతే కాకుండా టెక్కలిలో హరికృష్ణే కాదు ఎక్కడ నుంచైనా తెలుగుదేశం తరఫున పోటీకి పుల్లను నిలబెట్టినా [illegible] ఖాయమంటూ నేను జారింది. ఇంటర్వ్యూలో లక్ష్మీపార్వతి ధోరణి తెలుగుదేశం సమస్తం 'తానే' అన్నట్లుండటంతో హరికృష్ణ ఘాటుగా లక్ష్మీపార్వతికి ఉత్తరం వ్రాసి, దాని ప్రతుల్ని పత్రికల వారికిచ్చారు.

కొరవ 11 పేజీలో

## RESIDENTIAL COLLEGE FOR

# BOYS

FULLY ESTABLISHED SPACIOUS CAMPUS IN THE OUT SKIRTS OF NELLORE TOWN

Date of Screening Test : 2-6-1995.

Venue: BOYS RESIDENTIAL COLLEGE CAMPUS, 7KM SOUTH OF NELLORE ON N.H.-5.

Time :
1st Batch 10 A.M & 2nd Batch 3 P.M

Chemudugunta, G.N.T. Road,
Nellore-524 320.

# KORA



Phones: 23210 - 24054 - 38354

**ADMISSIONS FOR JUNIOR INTER FOR THE ACADEMIC YEAR 1995-96.**

M.P.C. and Bi.P.C. Groups ENGLISH MEDIUM ONLY.
Selection will be based on a Screening test (MATHEMATICS, PHYSICAL SCIENCES AND BIOLOGICAL SCIENCES) Common for M.P.C. and Bi.P.C. groups.
Type of Test: Objective (Multiple Choice) 2 1/2 hours duration. (Separate papers for CBSE and State syllabus)
Eligibility: Candidates expecting 1st class in X class or equivalent in 1995 March. Telugu Medium students expecting above 80% in X class may take the screening test in Telugu Medium.
Matriculates need not apply.

## RESIDENTIAL COLLEGE FOR

# GIRLS

A SEPARATE CAMPUS FOR GIRLS IN THE HEART OF NELLORE TOWN WITH DECENT HOSTEL FACILITY.

Date of Screening Test : 4-6-1995

Venue: GIRLS RESIDENTIAL COLLEGE CAMPUS, R.L. REDDY NAGAR, NELLORE.

Time :
1st Batch 10 A.M & 2nd Batch 3 P.M

R.L. Reddy Nagar, Near Collector's Bangalow
Dargamitta, Nellore-3.

Prospectus and application form can be had from the office of KORA INSTITUTE, 24/435-3, Tekkemitta, Nellore-3. from 20-5-95 on wards. Send Rs.50/- by M.O. only.
Candidates may directly appear for screening test with two passport size photographs.

## EAMCET - 94 STATE TOP RANKERS FROM OUR RESIDENTIAL COLLEGE



5

A.V.MAHESH (MEDICAL) H.T.No. 24867



1

T. JAWAHARLAL (ENGINEERING) H.T. No. 132018

6



J.SATISH (MEDICAL) H.T.No.46757

# టాడా చట్టం

తీవ్రవాద, విచ్ఛిన్నకర కార్యకలాపాల నిరోధ చట్టం 'టాడా' విషయంలో దేశంలో విపరీతమైన వివాదాలు చెలరేగుతున్నాయి; దాన్ని కొనసాగించాలా, రద్దు చేయాలా అన్న సంగతి ఎటూ తేల్చ లేక పోతున్నారు. నాన్చుడు వ్యవహారంలో నిపుణుడైన ప్రధాన మంత్రి శ్రీ పివి నరసింహా రావునే ఈ వివాదాన్ని మరింత కాలం నానుస్తూ, దాటవేయడం అలివి కావడం లేదు. అది అటువంటి సున్నితమైన సమస్యగా రూపాంతరం చెందింది.

పంజాబ్‌లో టెర్రరిస్టుల దుర్మార్గాలను నివారించడానికి ఈ ప్రత్యేక చట్టం తయారు చేశారు. ఇదే తరహాలో ఇది వరకు అమలులలో వుండిన 'నాసా' 'మీసా' చట్టాలు అపఖ్యాతి పాలు కావడంతో, అటువంటి అధికారాలే కల్గిన ఈ కొత్త చట్టాన్ని రూపొందించింది ప్రభుత్వం. పంజాబ్‌లో దీని వాడకం విస్తృతంగా వుండింది; ఫలితాలూ బాగానే సిద్ధించాయి. అయితే ఇదే చట్టాన్ని అయోధ్య పరిణామాల దోషుల పైన, బొంబాయి మత కలహాల నేరస్తుల పైన ప్రయోగించి నప్పుడే వివాదం చెలరేగింది. విస్తృతమైన అధికారాలు కల్గిన ఈ చట్టాన్ని స్థానిక పోలీసులు, రాజకీయ వాదులు విచక్షణా రహితంగా వాడారని; అమాయకులు అటువంటి వారి హింసకు గురైనప్పుడు ఏ న్యాయస్థానమూ వారిని కాపాడ కాపాడకలేక పోతున్నరని పౌర హక్కుల నాయకులు గగ్గోలు పెడుతున్నారు. ఇంకొక ప్రక్క ముస్లిం వ్యతిరేక చట్టంగా దీనికి పేరు వచ్చింది. అది దాన్ని మరీ భ్రష్టు పట్టించింది. అందువల్ల దీని వుపసంహరణకు ముస్లిం వర్గాల నుంచి మరీ తీవ్రమైన ఒత్తిడి ఎదురౌతున్నది. బిజెపి, ఎఐఎడిఎంకె మినహా దేశంలోని ఇతర ప్రతి పక్షాలు టాడా రద్దు కోరుతున్నాయి. కాంగ్రెస్ పార్టీయే ఎటూ తేల్చుకోలేక పోతున్నది.

ముఖ్యమంత్రుల సమావేశమూ దీనిపై ఏకాభిప్రాయానికి రాలేదు. పార్టీ పరంగా వ్యతిరేకిస్తున్నప్పటికీ, చాలా మంది ముఖ్యమంత్రులకు దీన్ని వదలుకోవడం ఇష్టం లేదు. అట్లని బయట పడి చెప్పలేరు. నిర్ణయాన్ని పివికె వదిలేశారు. ఈ చట్టం కాల పరిమితి ఈ నెల 24 తేదీతో ముగుస్తుంది కాబట్టి, ఆ లోగా ఒక నిర్ణయానికి రావాలి. రద్దు చేయడం సమస్య కాదు; కొనసాగించాలంటే పార్లమెంట్‌లో కాంగ్రెస్‌కు వున్న బలం చాలదు. బిజెపి సహకారం తీసుకొని, కొనసాగించే తీర్మానానికి మెజారిటీ చేకూర్చి పెడితే, అసలే కాంగ్రెస్ పట్ల ద్వేషం పెంచుకొని వున్న ముస్లింలు మరింత దూరమై పోతారు. రద్దు చేస్తే పంజాబ్, ఎల్‌టిటిఇ, నక్సలైట్లు, పాకిస్తాన్ ఏజంట్ల కిరాతకాలను అదుపు చేయడం అలివౌతుందా అన్నది సమస్య.

దేశంలో ఇప్పుడుండే చట్టాలు తీవ్రవాదం అణచి వేతకు సరిపోతాయని విమర్శకుల వాదన. కాని అది నిజం కాదు. ప్రస్తుతం వున్న ఏ చట్టం ప్రకారమైనా నేరస్తుడ్ని, లేదా అనుమానితుడ్ని కోర్టులు బెయిల్‌పైన విడుదల చేసేస్తున్నాయి. ఎంతో కష్టపడి నిర్బంధించిన నేరస్తుడు తమ కళ్ల ముందే దర్జాగా కారెక్కి వెళ్లి పోతుంటే, తిరిగి కన్పడకుండా మాయమౌతుంటే పోలీసులు నిస్సహాయులై నిలబడి పోతున్నారు. నాగరిక పద్ధతులలో నిందితుల్ని సంస్కరించలేని కొందరు పోలీసు అధికారులు, ఈ చట్టాన్ని అడ్డు పెట్టుకొని నిందితుల్ని హింసించడం వల్లనే ఇది ఇంతగా అపఖ్యాతి పాలౌతున్నది.

అయితే ఒకరిద్దరు పోలీసులు పొరపాట్లు చేస్తున్నారన్న అభిప్రాయంతో చట్టాన్ని రద్దు చేస్తే వివిధ జైళ్లలో వున్న వేలాది మంది దేశ ద్రోహులు ఒకేసారి బయట పడతారు.

జమీన్‌రైతు

వారిని బంధించడానికి పోలీసు యంత్రాంగం పడిన శ్రమ, చూపిన నైపుణ్యం వృధా అయిపోతుంది. అది చాలా ప్రమాదకరమైన పరిస్థితి. ప్రభుత్వం ఆ రిస్క్ తీసుకోజాలదు. సరిహద్దు రాష్ట్రాలలో పాకిస్తాన్ చేస్తున్న దుర్మార్గాలను నిరోధించడానికి ఇటువంటి కఠిన చర్య ఎంతైనా అవసరం.

కేవలం ముస్లింలను సంతృప్తి పరచడానికి జాఫర్ షరీఫ్, గులాం నబీ అజాద్‌లు తాము ప్రభుత్వంలో మంత్రులమై వుండి, వివాదస్పద ప్రకటనలు చేస్తున్నారు. కేవలం రాజకీయ దృష్టి తప్ప వారిలో దేశ అవసరాల పరిగణన లేదు.

టెర్రరిజం, దేశ ద్రోహం చాలా ప్రమాదకర నేరాలు. వాటికి పాల్పడే వారు చాలా ఆరితేరి వుంటారు. నాయనా, బాబు అని గడ్డం పట్టుకొని బ్రతిమి లాడితే వారిలో మార్పు వస్తుందా? అటువంటి వారి వారి పట్ల కఠినంగా వ్యవహరించక తప్పదు. చట్టం దుర్వినియోగం అమాయకుల హింస అంటే, ఆ తత్వం కల్గిన పోలీసులు ఏ చట్టంలోనైనా తమ పద్ధతులే పాటిస్తారు. వారికి టాడా వున్నా ఒకటే, లేకున్నా ఒకటే. అందువల్ల కేంద్రం ఈ విషయంలో రాజకీయ అవసరాలు కాకుండా, దేశ రక్షణ, భద్రతలను పరిగణనలోనికి తీసుకొని ఆలోచించాలి, నిర్ణయం తీసుకోవాలి. అవసరమైన మార్పులతో టాడాను కొనసాగించడం దేశ రక్షణా దృష్ట్యా చాలా అవసరం.

---

## జమీన్‌రైతు 11.5.1945

వెల: 0-1-6 పేజీలు:8

### శృతిమించింది

అండాళ్ మోటార్ సర్వీస్ స్థితి శృతిమించి రాగాన పడుతున్నది. చెడిపోయిన బస్సులిచ్చి డ్రయివర్లను బాధించడం, ఇష్టం వచ్చినట్లు డ్రైవర్లను కండక్టర్లను తరిమి వేయడం, పైగా "చెప్పుకో పోవోయ్ యూనియన్‌తో" అనడం. నిజం. యూనియన్‌తోనే చెప్పుకుంటారు. మోటారు లేబర్ కష్ట నిష్ఠూరాల తొలగించడానికే యూనియన్ ఏర్పడింది. యూనియన్ ఏం చేసింది? బ్రతిమాలుకుని, భంగపడి, యూనియన్ గౌరవ కార్యదర్శికి పలుమార్లు చెప్పి పంపించి, మాట్లాడి, తిరిగి నౌకరిస్తానని చెప్పి, మళ్లీ మనసు మార్చుకుని, నౌకరివ్వక తంటాలు పెడుతుంటే, యూనియన్ను ఏం చేయమంటారు? వర్కర్ల తాడు తెగితే తెగిందని, ఓనర్ ఆడింది ఆట, పాడింది పాటగా యూనియన్ భావిస్తే, అప్పుడు యూనియన్ మంచిదా? బాగు బాగు?

### పల్లెపాడు పాఠశాల

ఈ రాజకీయ పాఠశాల శ్రీ ఓరుగంటి వెంకట సుబ్బయ్య గారి ఆచార్యత్వ మున నడుస్తున్నది కాలేజి లెక్చరర్ సుబ్రహ్మణ్యము గారు డా. మురహరి రావు గారు యింకా కొందరు అధ్యాపకులు చరిత్ర, కుటీర పరిశ్రమలు, ప్రకృతి వైద్యము మొదలగు విషయములను బోధిస్తున్నారు.

### నాటకాల పురాణం

"రౌడీ రౌడీ ఫాలంబ్ రౌడీ" అన్నారు జోగి నెల్లూరు పిల్లకాయలంతా కొంత గల్పా బట్టించి వదిలారు యీ ఫాలంజీని.

రౌడీజం షుమారుగా వున్నదన్నారు. గేటు వద్ద పూర్తి రౌడీజం చేసిన పెద్దలంతా.

### ఆదివారాల విశ్రాంతి

నెల్లూళ్లో నూలు వర్తకుల సంఘం, వస్త్ర వ్యాపారుల సంఘం వర్తక గుమాస్తాలకు ఆదివారాల విశ్రాంతిని ఆమోదించినవి. ఇందుకు సంతోషాన్ని వెలిబుచ్చుతూ, ఇతర వర్తకుల సంఘం కూడా ఆ పద్ధతినే ఆమోదించ వలెనని కోరుతూ పేట వర్తక గుమాస్తాల సంఘం కోరుతున్నది.

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

### నెల్లూరు ముచ్చట్లు

పెద్ద చెరుకూరు కరణం శ్రీ కంఠం సుబ్బరామయ్య గారి వద్ద రెండు తెల్ల యెద్దులు ఎక్కడివో తప్పించుకొని వచ్చి వున్నవట. కరణీకం లెక్క నేర్చుకోవడానికి వచ్చినవి కాబోలు?

* * *

కొంకెటి శ్రీరాములు శెట్టి బ్రదర్సు వారికి 5.5.45 నుండి ఒక మాసం గుడ్డల లైసెన్సు రద్దు జేశారు. ఎండా కాలంలో యిదీ వొక లాభమే.

* * *

[illegible] 10 పేజీలో

---

# చౌక డిపోల దోపిడీ సత్వరమే అరికట్టాలి!

జిల్లాలోని చౌక ధర దుకాణా దారులు ప్రజలను ఇబ్బందులు పెడుతున్నారు. ముఖ్యంగా కిరోసిన్, బియ్యం పంపిణీలో అనేక అవకతవకలకు పాల్పడు తున్నారు. నెలాఖరుకు షాపులకు సరకులు తీసుకొని వస్తారు. చాలా మంది వద్ద డబ్బులు లేక కొనలేక పోవడంతో యధేచ్ఛగా బ్లాక్ మార్కెట్‌కు తరలిస్తున్నారు. జిల్లాకు కిరోసిన్ కేటాయింపు తక్కువగా వుంటున్నందున అందరికీ కిరోసిన్ ఇవ్వలేక పోతున్నట్లు సంగనాచి కబుర్లు చెబుతారు. ఆదివారం అంగళ్ళు తెరవాల్సి వుండగా, ఎక్కువ మంది వినియోగ దారులు సరకులూ తీసుకెళ్లారని మూసి వుంచుతున్నారు. అన్ని సరకులు ఒకేసారి ఇవ్వరు. ఒకటి తరువాత ఒకటి ఇస్తున్నందున 10 రోజుల పాటు ప్రజలు రేషన్ షాపుల చుట్టూ తిరగాల్సి వస్తుంది. ఇక కొలతల సంగతి ప్రత్యేకంగా పేర్కొన బళ్ళేదు. ప్రజలను రేషన్ షాపుల వారు పెట్టె బాధలు ఎప్పటి కప్పుడు వున్నతాధికారులకు తెల్పడానికి ఎమ్మార్వో కార్యాలయాల్లో ఫిర్యాదుల పెట్టె ఏర్పాటు చేయాలి. నెల నెల వీటిని జాయింట్ కలెక్టర్ గారు చూసి తగిన చర్యలు తీసుకోవాలి. ఈ పద్ధతి కొత్త జాయింట్ కలెక్టర్ మన జిల్లాలో ప్రవేశ పెట్టాలని మనవి.

నెల్లూరు -ఆర్.కె. విశ్వనాథ్

---

## నాగభూషణం నెల్లూరు పేరు నిలబెట్టారు!

నెల్లూరు జిల్లాలో జన్మించి, నాటక రంగంలో ప్రవేశించి 'రక్తకన్నీరు' నాటకంతో నటుడుగా నాగభూషణం వొప్ప పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొన్నారు. 300 పైగా సినిమాల్లో నటించి ఇటు నాటక రంగం - అటు సినిమా రంగాల్లో తన ప్రత్యేకత నిలుపు కొన్నారు. సినిమాల్లో నయవంచకుడిగా, మేక వన్నె పులిగా, తేనె పూసిన కత్తిగా, ఏమీ ఎరగని అమాయకుడిగా నటిస్తూ ప్రజలకు ద్రోహం చేసే రాజకీయ

[illegible] 10 పేజీలో

**జనవాణి**

# 600 మంది సిబ్బంది వున్నా ఆరోగ్యశాఖకు అనారోగ్యమే!

నెల్లూరు మునిసి పాలిటీలో ఆరోగ్య శాఖ అనేది ఒకటి వుందని చాలా మందికి తెలిసి వుండదు. తెలిసే అవకాశం రాకుండా చాలా జాగ్రత్త పడుతుంటారు తత్సంబంధిత అధికారులు, సిబ్బంది! తెలిస్తే చాలా సమస్యలు. వుంది ఏమి చేస్తున్నట్లు అనే ప్రశ్న ఉత్పన్న మౌతుంది. ఆ ప్రశ్న తలెత్తితే చాలా ప్రమాదం. ఏదో ఒక పని చేయాలి. పని చేయడమనే అలవాటునే మర్చిపోయిన వారికి అది ఎంత కష్టం? అందుకే వారు ఆరోగ్య శాఖకు శాశ్వత అనారోగ్యం సంప్రాప్తింపజేసి, ఆ రోగం తగ్గకుండా జాగ్రత్త పడుతుంటారు!

హెల్త్ శాఖలో 600 మంది సిబ్బంది పని చేస్తున్నారంటే ఎవరికైనా ఆశ్చర్యం కలగక మానదు. వీరు వీధులు చిమ్మాలి; కాలువలు పూడ్చాలి; డ్రైన్లు రిపేరు చేయాలి; చెత్త తొట్లు శుభ్రం చేయాలి; మురికిగా వుండే ప్రదేశాలను క్షాళన చేయాలి; పాలల్లో నీళ్ళున్నాయో, నీళ్లలో పాలున్నాయో పరీక్షించాలి; హోటళ్లలో పరిశుభ్రత ప్రమాణాలు పర్యవేక్షించాలి; తిను బండారాల విక్రయం నియంత్రించాలి; ఫ్యాక్టరీల కాలుష్యం నిరోధించాలి; దోమల బెడద నివారించాలి; కలరా, జాండిస్‌లు రాకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. చెప్పుకుంటూ పోతే ఇటువంటి పనులు చాలా చాలానే చేయాలి. ఈ పనులన్నీ చేయడానికి 600 మంది సిబ్బంది, 100 మందికి పైన ఎన్ఎంఆర్‌లు, మేస్త్రీలు, శానిటరీ ఇన్స్‌పెక్టర్లు, హెల్త్ ఆఫీసరు వగైరా వగైరా యంత్రాంగ

## నెల్లూరు సంగతులు

మంతా పుష్కలంగా వుంది. కాని అందులో సగం మంది కూడా, సగం పనులు కూడా చేయడం లేదు. ఏటా రెండు కోట్ల వరకు జీత భత్యాలకు వెచ్చిస్తున్నప్పటికీ ఎవరిలోనూ పనిపట్ల శ్రద్ధ లేదు. మరీ దుర్మార్గమైన విషయమేమిటంటే- కొందరు సిబ్బంది జీతాలు మాత్రం తాము తీసుకొని, అందులో సగం జీతానికి వేరే పని వారిని కుదిర్చి, తమ పని వారి చేత చేయిస్తున్నారు. శానిటరీ పనులు చేయాలంటే వారికి నామోషి; 1 తేది జీతాల కోసం తప్ప వీరు ఆఫీసుకే రారు. అయినా అధికారులు వారిని అడగరు. అడిగేందుకు వారికి నైతిక హక్కు లేదు. కారణం- వారూ పనిచేయరు కాబట్టి!

అధిక భాగం శానిటరీ ఇన్స్‌పెక్టర్లు పాల వ్యాపారుల నుంచి మామూళ్లు పుచ్చుకొంటూ కాలక్షేపం చేసేస్తున్నారు. ఒక శానిటరీ ఇన్స్‌పెక్టరు మండపాల వీధి మొగుదాలలో క్యాను పెట్టుకొని కూర్చుంటాడట; సైకిల్ మీద పాలు తెచ్చే ప్రతి వాడూ ఒక లీటరు పాలు ఆ క్యానులో పోసి తీరాలట. భారతంలో అదేదో రాక్షసుడికి పూట పూటా భోజనం పంపించినట్లు,

> * జీతాలు తీసుకొనే వారు ఒకరు-
> చాకిరీ చేసే వారు వేరొకరు!
> * వీధులు చిమ్మరు, కాలువలు పూడ్చరు,
> * హెల్త్ చెకింగ్ అసలు లేనేలేదు!

ఇతగాడికి పాల వ్యాపారులు ప్రతి దినం ఈ మామూలు చెల్లించాలి. ఆ సంతృప్తితో ఆ దొరగారు ఆ ప్రాంతంలో పాలవాళ్ళ నీళ్ల అమ్మకాన్ని భద్రంగా రక్షిస్తారు; ఎవరైనా ఈ నియమం ధిక్కరిస్తే, ప్రక్క రోజే పాల శ్యాంపిల్ తీసి, కాళ్ల బేరానికి తెప్పిస్తారు.

శానిటరీ సిబ్బందికి చెందాల్సిన సబ్బులు, కొబ్బరి నూనె వగైరాలు అసలు వస్తు రూపంలో ఆఫీసుకు చేరవు; కాగితాల పైనే కొనుగోళ్లు. ఇటీవల కాలంలో ఒక్క హోటల్‌ను వీరు చెక్ చేసిన సాదృశ్యం లేదు. నెల భత్యం ముడితే చాలు; సాంబరో, కోడి కూరో కొసరు లంచం!

వీధుల్లో మట్టి అరడుగు ఎత్తున పేరుక పోయి వుంది. మంత్రో, అధికారో వచ్చే రోజు ట్రంకురోడ్డులో మాత్రం చిమ్ముతారు. ఆ తర్వాత మళ్లీ కన్పడరు. సైడు సందులు, గొందులకు చీపుర కట్ట స్పర్శ తగిలి ఎన్నేళ్లయిందో; వాన దేముడే వాటికి సీజనల్ స్వీపర్!

కొత్త ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డికి హెల్త్ శాఖను దారిలో పెట్టడం చాలా పెద్ద శ్రమ పూరిత కార్యంగా వున్నట్లుంది. ఏళ్ల తరబడి పనులకు అలవాటు పడక, సోమరిపోతుల వలె తిరిగే సిబ్బంది చేత నచ్చచెప్పి పనిచేయించడం చిన్న పనా? ఆ శాఖను కదిలిస్తే కందిరీగల తుట్టె మాదిరి అవుతుందన్న భయం ఛైర్మన్‌లో, కౌన్సిలర్లలో వున్నట్లుంది.

టౌన్ విస్తీర్ణం పెరిగే తీరులో సిబ్బంది సంఖ్య పెరగక పోవడం తమ సమస్య అని అధికారుల అభిప్రాయం. వారి లెక్క ప్రకారం నెల్లూరులో శానిటరీ పనులు సక్రమంగా జరగాలంటే కనీసం 1200 మంది సిబ్బంది కావాలట. ఒకేసారి వందల సంఖ్యలో సిబ్బందిని నియమించుకొనే స్థోమత మునిసిపాలిటీకి లేదు. ఉన్న సిబ్బంది కనీసం సగం జీతం విలువకు పనిచేసినా టౌన్ ఈ అధ్వాన్న పరిస్థితిలో వుండదు. వివేకానంద రెడ్డి పది రోజుల పాటు ప్రొద్దున్నే కర్ర చేతిలో పెట్టుకొని వీధుల్లో నిలబడితే వారిలో ఏదైనా మార్పు వస్తుందేమో చూడాలి. ముల్లగర్రతో పొడిస్తే తప్ప కదిలే స్థితిలో లేదు ఆరోగ్య శాఖ. శానిటరీ ఇన్స్‌పెక్టర్లను ముందు దారిలో పెడితే, సిబ్బంది వారంతట వారుగా దారికి వస్తారేమో ప్రయత్నించి చూడండి!

### చేనేత కార్మికుల పై చిన్నచూపు!

జిల్లా, మండల పరిషత్తులకు ఎన్నికైన చేనేత కార్మికుల సన్మాన సభ ఇటీవల టౌన్‌హాల్‌లో జరిగింది. అధ్యక్షత వహించిన ఐ.ఎన్.టి.యు.సి. నాయకుడు బి. రాధయ్య మాట్లాడుతూ ప్రభుత్వం చిన్న చూపు కారణంగా చేనేత కార్మికుల బతుకులు దుర్భర మయ్యాయన్నారు. తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చిన తరువాత చేనేత కార్మికుల జీవితాలు బాగు పడతాయని ఆశించినా నిరాశే

కొరవ 10 పేజీలో




వర్తమాన సమాజం యాజమాన్యమున నిర్వహింపబడిన గ్రంధావిష్కరణ సభలో పెళ్ళకూరు రామచంద్రా రెడ్డికి కృతిని సమర్పిస్తున్న వేలనూతల శ్రీరామమూర్తి దంపతులు, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, మేనకూరు గోపాలకృష్ణా రెడ్డి, బి.వి. రమణారెడ్డి, బి.వి. నరసింహం.

## సణుగుడు

### * నగర జీవితంలోని నరకానికి సజీవ తార్కాణం కలకత్తా సిటీ

రాజీవ్ గాంధీ ఒక సారి కలకత్తా నగరాన్ని "డైయింగ్ సిటీ" అని వ్యాఖ్యానిస్తే, విమర్శకు లందరూ కాకి గోల చేశారు. ప్రపంచంలోనే అత్యంత జనాభా కల్గిన నగరమైన కలకత్తాను ఆయనంత మాట ఎందుకన్నాడో అర్థమయ్యేది కాదు. కాని దాన్ని స్వయంగా చూసిన తర్వాత అన్పించింది - అది డైయింగ్ సిటీ కాదు, డెడ్ సిటీ అని! ప్రపంచంలో ఎన్నో నగరాలు చూశాను; మన దేశంలోని చిన్న పెద్ద ప్రదేశాలు చాలానే తిరిగాను. కానీ కలకత్తాలో రెండు రోజులు గడిపే టప్పటికే వూపిరాడని ఫీలింగ్ కల్గింది. ఎప్పుడెప్పుడు బయటపడదామా అన్న ఆతృత ఏర్పడింది. ప్రేతకళ అంటారే- అది తాండవిస్తున్నదా నగరంలో! జీవకళ మచ్చుకూ లేదు. పురావస్తు శాఖ వారి త్రవ్వకాలలో బయల్పడిన ఒక పురాతన పట్టణంలో జనం నివాస మేర్పర్చు కున్నట్లుగా వుంది. ఎటు చూసినా పాడుబడి పోయిన భవంతులు; చెట్లు మొల్చి, పాచి పట్టి, వికృతంగా కన్పించే గోడలు; రేపో మాపో కూలడానికి సిద్ధంగా వున్న పెంకుటిళ్లు; రేకులు లేచిపోయి, పొగకు నల్లగా కమిలి పోయిన ఫ్యాక్టరీలు; ఏ మహారాజుల కాలం నాడో వైభవంగా వెలిగి, వారితోనే ప్రాభవం కోల్పోయి, శిథిలమై పోయిన నగరం వలె వుంది కలకత్తా.

అక్కడి పౌర జీవితమూ దుర్భరం, దుస్సహం. వీధుల్లో నడవడానికి కూడా సందు లేదు. కిటకిట! విపరీతమైన వాతావరణ కాలుష్యం; చాలా వీధుల్లో భయంకరమైన దుర్వాసన; గాలి వీలితే దుమ్ము చెలరేగి పోతూంది; రోడ్డంతా

**డోలేంద్ర**

పరుచుకొన్న చెత్తా, చెదారం; రోడ్డు పైనే హోటళ్లు, అక్కడే జనం స్నానాలు అక్కడే మలమూత్ర విసర్జనలు; కొన్ని వేల మందికి, లక్షల్లో వుంటారేమో కూడా- ఫ్లాట్ ఫారాలే పడకటిళ్లు, ప్రసూతి గదులు- ఎటు చూసినా పేదరికపు వికృత తాండవం. చేతులతో లాగే రిక్షాలు - టాంగాలని కాబోలు పిలుస్తారు- ఇంకా వున్నాయి. ఆ రిక్షా లాగే వాడి కాళ్లకు చెప్పులు కూడా లేవు. సిటీ బస్సులు మన మునిసిపాలిటీ కుక్కల బండ్లతో సమానం. బస్సులు పొట్టి; లోపల చెక్క బెంచీలు; గాలి దూరే సందు కూడా లేని చిన్న చిన్న కిటికీలు; వాటిలో క్రిక్కిరిసిన జనం. ఆ బస్సుల్లో తిరగ వలసి రావటం కంటే పెద్ద శిక్ష ప్రపంచంలో మరొకటి వుండదు. వీధుల్లో

కొరవ 7 పేజీలో



# ఉత్తరక్రియలు

మా తల్లిగారైన

## దేవళ్ళ తులశమ్మ గారు

1.5.95 తేది సోమవారం స్వర్గస్తురాలైనారు.

15.5.95 తేది శిలాప్రతిష్ట

16.5.95 తేది పందిరి

17.5.95 తేది ఎత్తురేవు

మోడేగుంటలోని మా స్వగృహమున జరుగును. కాన తెలియజేయడమైనది.

కుమారులు

దేవళ్ళ రామచంద్రా రెడ్డి | దేవళ్ళ శేషురెడ్డి

దేవళ్ళ సుందరరామిరెడ్డి | దేవళ్ళ సుబ్బారెడ్డి




మద్రాసు సన్మాన సభలో పెళ్ళకూరుకు పూలకిరీటం పెట్టి, పెండ్లి కొడుకుగా ముస్తాబు చేసిన దృశ్యం; ప్రక్కన ఎల్‌వి రామయ్య, డాక్టర్ సిఎంకె రెడ్డి, మాగుంట సుబ్బరామ రెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి, వెంకటస్వామి, ఆల్లారెడ్డి వెంకట కృష్ణారెడ్డి, నిప్పో ఓబుల రెడ్డి, ఎం. రామరాఘవ రెడ్డి, సవేరా శ్యామసుందర రెడ్డి, డి. ఆదిశేషారెడ్డి.

# రైతు బ్రతుకుతో తుఫాన్ చెర్లాటం!

రైతు పచ్చగా వుంటే ప్రకృతి చూసి ఓర్వలేదు. దానికి ఎక్కడ లేని కుళ్లు మోతు తనం; ఒక్క రైతుల పైనే ప్రకృతి ఎందుకు పగబట్టి ప్రవర్తిస్తుందో భగవంతుడికే తెలియాలి. అది పగ కాకుంటే మిడిమేళపు ఎండలు మిడిసి కాసే మే నెలలో - వానలేమిటి. తుఫానేమిటి? అందులో ఒకటి కూడా కాదు - రెండు వాయు గుండాలు. 5 తేది నుంచి 10 తేది వరకు వరుసగా, విడవకుండా దంచి కొట్టింది వాన; అక్టోబరులో కురిసినట్లు కురిసింది. బంగాళా ఖాతంలో రేగిన ఈ తుఫాన్లు జిల్లా రైతాంగం నడ్డి విరిచాయి. తడి గుడ్డతో గొంతు కోసినట్లు, మూగ దెబ్బలు కొట్టినట్లు రైతును నష్టాల పాల్జేసింది వాన. చూసే వారికి పెద్ద వాన కాదు; ఇళ్ళు కూల లేదు; ఎవ్వరూ చావలేదు; వరద లొచ్చి వూళ్ళు కొట్టుకొని పోలేదు; కానీ రైతు ఆర్థిక పరిస్థితి మాత్రం చితికి పోయింది. అదును కాని సమయంలో, అ కాలంలో కురవడం వల్ల పొలాల్లో వేసి వుంచిన కుప్పలు మొలలోతు నీటిలో మునిగి పోయాయి. ఐదు రోజులు తగ్గక పోవడం వల్ల కొద్ది కొద్దిగా నెమ్మెక్కి, వూటెక్కి కుప్పలోనే గింజలు పచ్చ బారి పోయాయి. కొందరు కుప్పలు నురసి, వడ్లు కయ్యిలోనే రాశి పోసి వుండినారు. అటువంటి రాశులు పనికి రాకుండా పోయాయి. కోసి పెట్టి వుండిన పనలు తెప్పలుగా తేలి పోయాయి వాటిలోని వడ్ల గింజలు మొలకెత్తాయి, పెసర, మినుము సర్వనాశనమే; పెరకడానికి కూడా పనికి రాకుండా పాచి పోయాయి. వేరుసెనగ పరిస్థితి అంతే. ఎందుకూ పనికి రాదు ఆ పైరు ఇక. మళ్లీ వేయడానికి అదునుకాదు. పెట్టిన పెట్టుబడి సమస్తం గోవిందే! కొన్ని చోట్ల మెట్ట పైర్లూ దెబ్బ తిన్నాయి.

అకాలంలో వాన
కుప్పలుతడిపింది;
పెసరనుముంచింది;
రైతు అల్లాడి
పోతున్నప్పటికీ
కలెక్టర్ గారు
బంగళా వదలి
బయటకురాలేదు!

చేతికందిన ఫలితం కళ్ల ముందే నీళ్ల పాలై పోతుంటే చూస్తూ ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో రైతులు అల్లాడి పోతున్నారు. వారికి కోలుకోలేని దెబ్బ. కోవూరు, నెల్లూరు డెల్టాలు రెండింటిలోను నష్టం సమంగానే వుంది. మే నెల కాబట్టి, ఎండా కాలం కాబట్టి అందరు రైతులూ కుప్పలు కయ్యిల్లోనే వుంచారు. వేళకాని వేళ వాన విరుచుక పడుతుందని వారు కలగనరు కదా?

రైతు బ్రతుకులతో తుఫాన్ ఇంత చెర్లాట మాడితే అధికారులు పట్టీ పట్టనట్లు వ్యవహరించడమే విచిత్రం. కలెక్టర్ గారు బంగళా దాటి బయటకు రాలేదు. వాన. గిన తన డ్యూటీ పరిధిలోకి రావను కున్నారో లేక వాన వస్తుంటే ఆపడానికి తానేమైనా దేముడ్నా అని ఆత్మను సంతృప్తి పరచుకున్నారో తెలియదు. రౌతు కళ్లెం పట్టి గుంజితేనే మూడు కాళ్ల మీద నడిచే గుర్రాలు మన అధికారులు; అటువంటిది రౌతు ఇంటి దగ్గర రెస్టు తీసుకొంటుంటె వీధుల్లో పరుగులెత్తురా వారు! ఒక్కరు కదలలేరు; వాన నష్టం చూడలేదు. సకాలంలో ప్రభుత్వానికి నివేదిక పంపక పోవడం వల్ల ముఖ్యమంత్రి నెల్లూరు జిల్లా పర్యటనకు రావడమే మానుకున్నారు. ఇక్కడేమీ జరగలేదని నివేదిక ఇచ్చారట జిల్లా అధికారులు. ఏదైనా జరగడమంటే వారి

కొరవ 7 పేజీలో



తుఫాన్ తాకిడికి గురైన ఒక గ్రామంలో నీట మునిగిన వరిపైరు



కయ్యిల్లో - కప్పిపెట్టి వుండిన వడ్ల రాశులు నీట మునిగి పోయిన దృశ్యం

# అడగకుండా భోజనం పెడ్తారు- అడిగినా పని మాత్రం చేయరు?

# పెళ్ళకూరు పేరు పది కాలాలు నిలుస్తుంది!

ఇఫ్‌కో ఛేర్మన్‌గా రెండవ టరమ్ నియమితులై నందుకు శ్రీ పెళ్ళకూరు రామచంద్రా రెడ్డి గారికి శర పరం పరగా సన్మానాలు, సత్కారాలు జరుగు తున్నాయి. పొగడ్తలు సంజీవని వంటివి; పదవి, దానితో వచ్చే పొగడ్తలు రాజకీయ వాదికి ఎక్కడా లేని ఆరోగ్యాన్ని సమకూర్చి పెడతాయి.

7 తేది, ఆదివారం, హోటల్ సవేరాలో రామచంద్రా రెడ్డి గారికి జరిగిన సత్కారం హార్దికమైనది. ఆహూతుల సంఖ్య తక్కువ; కాని వచ్చిన వారందరూ అతి ముఖ్యులు. వారి అభినందనలూ ప్రత్యేక తరహాలో వుండినాయి.

అమృతం త్రాగినంత హుషారుగా తయారౌతారు ఎవరైనా! రామచంద్రా రెడ్డి గారి పరిస్థితి అదే ఇప్పుడు. వయస్సు పెరిగే కొద్దీ ఆయనలో చలాకీతనం పెరిగి పోతున్నది. జింక పిల్ల లాగా గంతులేయగల్గిన ఉత్సాహం ఆయనలో ఆద్యోతక మౌతున్నది.

నెల్లూరులో జరిగే సన్మానాలే అంతటి కిక్కు నిస్తుంటే, ఇక మద్రాసు మహా నగరంలో మహా గొప్ప సత్కారం జరిగినప్పుడు కల్గే ఆత్మ సంతృప్తి చెప్పాలా? మద్రాసులోని నెల్లూరు ముఖ్యులందరూ కలిసి ఆయనకా ఆనందం చేకూర్చి పెట్టారు.

సభను డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు అధ్యక్షించారు. పెళ్ళకూరుకు ఇఫ్‌కో రెండో పెళ్ళాం వంటిది; దాని అభివృద్ధికి ఆయన చాలా కష్ట పడుతున్నారు. నెల్లూరులో 1200 కోట్లతో ఫ్యాక్టరీ స్థాపించడం చాలా గొప్ప విషయం. దానివల్ల ఆయన పేరు పది కాలాల పాటు నిల్చిపోతుంది అన్నారు బెజవాడ గోపాలరెడ్డి గారు.

ప్రత్యేక అతిథిగా విచ్చేసిన కేంద్ర మంత్రి శ్రీ జి. వెంకట స్వామి - పెళ్ళకూరు వద్దకు ఎవరు వెళ్లినా, అడగకుండా భోజనం పెడతారు; కానీ

కొరవ 8 పేజీలో

# నెల్లూరు నలుచెళ్లల్లో

## విహార్యకుడు

### ఏటికి నీళ్లు

తుఫాన్ వల్ల పెన్నకు పుష్కలంగా నీరు వచ్చాయి. 8 తేది మధ్యాహ్నం సంగం ఆనం కట్ట పైన 8 అడుగులు, నెల్లూరు ఆనకట్ట పైన రెండు అడుగులు నీళ్లు పారాయి. అప్పుడా వారధి మీద నీళ్లు లేవు కాని, ఆన కట్టకు ఎగువన నిండుగా వుంది నేరు. సోమశిలకు పెద్దగా నీరు రాలేదు.

ఈ ప్రవాహం వల్ల అప్పుడు పంట లేసుకొనే వారికి నీటి సమస్య వుండదు. నెల్లూరు, కనిగిరి చెరువులు రెండు నిండుగా వున్నాయి. ఉన్న పంట పోయినా, వచ్చే పంటకు నీళ్లు గ్యారంటీ కావడం గుడ్డిలో మెల్ల!

### జనార్ధన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 13 తేది శనివారం ఉదయం తిరుపతి మీదుగా వాకాడు వస్తారు. 14 తేది ఉదయం మళ్లీ తిరుపతి - పెండ్లి అటెండెన్స్; 11గంటలకు తిరిగి నెల్లూరు. సాయంత్రం వరకు టౌన్‌లో వుంటారు. 15 తేది వెంకటగిరి; రాత్రికి వాకాడు. 16 తేది ఉదయం తిరుపతి మీదుగా హైదరాబాదు.

### హరికృష్ణ రాక-రమేష్‌రెడ్డి చొరవ

ఎన్టీఆర్ మూడో కొడుకు హరికృష్ణ ఈ రోజు (12 తేది) నెల్లూరు వచ్చారు. తుఫాన్ దెబ్బ తిన్న గ్రామాలలో తిరిగి పరిస్థితి అన్న గారికి నివేదిస్తారట. నెల్లూరు రూరల్ మండలంలోని కాకుపల్లి, టౌన్‌లో యేలమవారి దిన్నె, జకీర్ హుసేన్ నగర్, సాయంత్రం కావలి పరిసర గ్రామాలు తిరుగుతారు. అక్కడ నుంచే రాత్రికి హైదరాబాదు రైలెక్కుతారు.

హరికృష్ణ రాజకీయ ఆరంగేట్రం చేసిన తర్వాత జరుపుతున్న తొలి జిల్లా పర్యటన ఇది. నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ టి. రమేష్ రెడ్డి చొరవ తీసుకొని ఫస్ట్ ... కొట్టేశారు. హరికృష్ణను రాజకీయాలలోకి తొలిగా స్వాగతించింది రమేష్ రెడ్డే! లక్ష్మీపార్వతిని ధిక్కరించి, ఈ నిర్ణయం తీసుకోవడానికి రమేష్ రెడ్డి పెద్ద సాహసమే చేసినట్లు లెక్క. ఎవరి రాజకీయ గణితాలు, వూహలు, అంచనాలు వారివి కదా!

రమేష్ రెడ్డికి జిల్లాలో ఏ ఎమ్మెల్యే సహకారం లభించడం లేదు. తక్కిన వారందరూ ఇంత తొందరపడి వర్గ ముద్ర వేయించుకునే ఆలోచనలో లేరు.

### చక్కెర మంత్రి

చక్కెర మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి 15 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. కావలి, విడవలూరు, గూడూరు, కోట తిరిగి 19తేది తిరుపతిలో తిరుగు విమాన మెక్కుతారు.

ఒకటికి రెండు తుఫాన్ దెబ్బలు తిని, రైతాంగం ఆర్తనాదాలు చేస్తుంటే మంత్రి గారు తీరికగా తుఫాన్ వెళ్లిన వారం రోజులకు జిల్లాకు రావడం; అది తన స్వంత గ్రామాలు చూసుకొని తిరిగి వెళ్లుండడం ఏమిటో అర్థం కావడం లేదు. ప్రసన్న కుమార రెడ్డి తాను జిల్లా కంతటికి సంబంధించిన మంత్రి ననుకోవడం లేదు; కోవూరు ఎమ్మెల్యే స్థాయి నుంచి ఎదగ లేదు. రాజకీయ భవిష్యత్ కోరే వారు చేయదగిన పని కాదిది!

### ఎమ్మెల్యేల నిర్లక్ష్యం

మంత్రే కాదు - జిల్లా ఎమ్మెల్యేలూ తుఫాన్ పట్ల తీవ్ర నిర్లక్ష్యం ప్రదర్శించారు. సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి, రమేష్ రెడ్డి, కొమ్మి లక్ష్మయ్య నాయుడు, జక్కా వెంకయ్యలు తప్ప మరే శాసన సభ్యుడు ఈ ఆపత్సమయంలో ప్రజలకు ముఖం చూపించ లేదంటే వారి ప్రవర్తన ఎట్లుందో అర్థం చేసుకోవచ్చు.

### జిప ఎన్నికలు

జిల్లా పరిషత్ స్థాయి సంఘం ఎన్నికలు 14 తేది జరుగుతాయి.

### జిప కాంగ్రెస్ ఎన్నికలు

జిల్లా పరిషత్ కాంగ్రెస్ సభా నాయకుడిగా వెంకటగిరి జిప సభ్యుడు శ్రీ సాముల జయరామయ్య వ్యవహరిస్తున్నారు. రాపూరు, శ్రీ మురళీధర్ ఉప నాయకుడు; ఆత్మకూరు సి.హెచ్. ఆదిశేషయ్య కార్యదర్శి; బుచ్చి శ్రీ వై. శివరామ కృష్ణారెడ్డి విప్.

6 తేది నెల్లూరు ఇందిరా భవన్‌లో డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి ఈ ఎన్నికలు నిర్వహించారు.

### "నారా" కోచింగ్

కోరా కోచింగ్ సెంటర్ భాగస్వాములలో ముఖ్యుడు డాక్టర్ నరసింహం ఆ సంస్థ నుంచి విడిపోయి 'నారా కోచింగ్ సెంటర్' అనే ప్రత్యేక సంస్థ ప్రారంభించారు. సరస్వతి నగర్‌లో కొత్త రైల్వే అండర్ బ్రిడ్జి దగ్గర భవనాలు వెలుస్తున్నాయి.

నరసింహం మంచి లెక్చరరు, అంతకంటే సమర్థుడైన సంస్థ నిర్వాహకుడు. కోరా కోచింగ్ సెంటర్‌లో ఎందరు భాగస్వాము లున్నా ... బయటకు తెలిసిన, బయట తిరిగిన వ్యక్తి నరసింహం గారే. పదేళ్లకు పైన కోచింగ్ సంస్థల నిర్వహణలో అనుభవం సంపాదించిన నరసింహం, తన కొత్త సంస్థను దిగ్విజయంగా నడిపిస్తాడనడంలో సందేహం లేదు. ఆయనకు మా బెస్టాఫ్ లక్ శుభాకాంక్షలు.

### బెజవాడ శతజయంతి

స్వర్గీయ బెజవాడ రామచంద్రా రెడ్డి గారి శత జయంత్యుత్సవాలలో భాగంగా 14 తేది సాయంత్రం 4 గంటలకు గూడూరు డిఎస్ఆర్ కమ్యూనిటీ హాల్‌లో సభ జరుగుతుంది. వెంకటేశ్వర విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ ఆర్. రామమూర్తి, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ రేబాల దశరథ రామరెడ్డి, బెజవాడ పాపిరెడ్డి తదితరు లందరూ పాల్గొంటారు. వెంకటగిరి రాజా కుటుంబీకుడు సాయికృష్ణ యాచేంద్ర గేయధార కార్యక్రమం నిర్వహింప బడుతుంది.

కొరవ 7 పేజీలో

## సణుగుడు

4 పేజీ కొరవ

నడిచే రైళ్లు (ట్రాంలు) దండిగా వున్నాయి. అవి దుమ్ము పేరుకొని పోయి, గలీజాగా గబ్బు కొట్టుకొంటున్నాయి.

ట్రాఫికెడి చెప్పలేని అస్తవ్యస్తత. ముందు, అటు అటు రెండు ప్రక్కలా చెట్లపడని కారు లేదంటే అతిశయోక్తి కాదు. రోడ్లోకి వస్తే తిరిగి ఇంటికి వెళ్లిందాకా గ్యారంటీ వుందన్పించదు. ట్రాఫిక్‌కు ఒక నియమమంటూ లేదు. ఎవరికి ఎటు పోవాలని తోస్తే అటు వెళ్లడమే పద్ధతి. కారులో కూర్చొని ప్రయాణిస్తుంటే ప్రాణాలు పిడికిట్లో పెట్టుకొని వుండాల్సిన పరిస్థితి.

పౌర సౌకర్యాలు బొత్తిగా లేవు. ఒక్క మంచి నీళ్లకు మాత్రం కట కట లేదు. గంగమ్మ తల్లి కరుణతో అవి దండిగా దొరుకుతున్నాయి.

ఇళ్ల బాడుగలు వింటే గుండె లదిరి పోతాయి. మంచి సెంటర్‌లో రెండు గదులున్న ఇంటికి నెలకు రు. 5 వేల బాడుగ. లక్షల్లో అడ్వాన్సులు. జీవన వ్యయం అపరిమితం; జీవన ప్రమాణాలు అత్యల్పం. మామూలు రిక్షా వాడి రోజు సంపాదన 60, 70 రూపాయలకు మించదు. ట్యాక్సీ డ్రైవరుకు నెలకు 1000 లు జీతమిచ్చే యజమానులూ వున్నారు. చిన్న చిన్న అంగళ్లు, వ్యాపార సంస్థలలో పనిచేసే గ్రాడ్యుయేట్లకు 700 లేదా 800 లు మాత్రమే జీతం. అందువల్ల ఇంటిల్లి పాదీ కష్టపడి సంపాదించనిదే పొట్టనిండడం దుర్లభం.

ఇటు ఒరిస్సా, అటు బంగ్లాదేశ్, బీహార్‌ల నుంచి లక్షల సంఖ్యలో నిరుపేద కూలీలు కలకత్తాకు వలస వచ్చేశారు; వస్తున్నారు. ఏదో ఒక చిన్న పని చేసుకొని పొట్ట నింపుకోవడం తప్ప మరే జీవన సౌకర్యం ఆశించే అవకాశం వారికి లేదు. వారిలో చాలా మందికి వుండడానికి ఇల్లు కూడా లేదు; చిరునామా లేదు. గాలి వాటానికి ఎగిరే గాలి పటం వంటి బ్రతుకులు వారివి. చాలా నికృష్టమైన జీవితాలు గడుపుతున్నారు. ఒక చిన్న పిల్లవాడు - ఏడెనిమిదేళ్లు కూడా వుండవు - బూట్ పాలిష్ చేస్తుండినాడు. వాడి ఫోటో తీసి, నీకొక కాపీ పంపిస్తాను, చిరునామా చెప్పమని అడిగాను. కళ్లలో నీళ్లు పెట్టుకున్నాడు.కారణం - చెప్పడానికి వాడికి చిరునామా లేదు; చెప్పు కోవడానికి వాడికి నా అన్న వాళ్లెవరూ లేరు. పసి వయస్సులోనే జీవిత పోరాటంలో అలిసి పోయి, వడలి పోయి వున్నాడు. మరీ విషాద మేమిటంటే, సాయంత్రానికి వాడి సంపాదనలో సగం స్థానిక గూండాకు చెల్లించాలట. లెక్క పొరపాటు వస్తే వీపు చిట్లి పోతుంది. తప్పించుకొని పారిపోవడానికి వీలు లేదు. సిటీలో ఎక్కడకు వెళ్లినా, ఏదో ఒక గూండా చేతిలో పడాల్సిందే.

ఇటువంటి దాదాగిరి సిటీలో నలుమూలలా వికృతంగా కన్పిస్తూంది. రైల్వే స్టేషను, చేపల మార్కెట్ వంటి ప్రాంతాలలో అయితే చెప్పనేలేము. మరీ దారుణమైన పరిస్థితి. ట్యాక్సీలను కూడా వారు దబాయిం చేస్తున్నారు.

ప్రపంచంలోకెల్లా అత్యధిక జన సమ్మర్థం కల్గిన సిటీగానే కాదు - అత్యంత కాలుష్యం కల్గిన నగరంగా కూడా రికార్డు స్థాపించింది కలకత్తా. జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయానికి చెందిన స్కూల్ ఆఫ్ ఎన్విరాన్ మెంటల్ స్టడీస్ సంస్థ నిర్వహించిన అధ్యయనంలో, కలకత్తా నగరంలోని వాతావరణంలో ఒక క్యూబిక్ మీటరు గాలికి 1801 మైక్రో గ్రాముల విష పదార్థాలు వున్నట్లు తేలింది. ప్రపంచ ఆరోగ్య సంస్థ నిర్దేశించిన ప్రమాణాల ప్రకారం వీటి పరిమితి కేవలం 75 వుండాలి. ప్రపంచంలోని మరే నగరంలో కూడా అంతటి విస్తృత స్థాయిలో విష పూరితమైన గాలి లేదట. దీనివల్ల 15 సంవత్సరాలు వీధుల్లో తిరిగిన వారికి క్యాన్సర్ రావడం ఖాయం. ఇతర జబ్బుల సంగతి చెప్పనే అవసరం లేదు. పశ్చిమ దేశాలకు చెందిన నగరాలలో అయితే 50 సంవత్సరాలు వీధిలో కాపురం పెట్టినా అంతటి ప్రమాదం రాదు.

జల కాలుష్యం సంగతి చెప్పనే అవసరం లేదు. నేను అక్కడున్న ఒక రోజు దినపత్రికల్లో వార్త వచ్చింది - స్థానిక ప్రభుత్వ ఆస్పత్రిలో డాక్టర్లందరూ జాండిస్ రోగులుగా మారి, అదే ఆస్పత్రి పడక లెక్కారని; రోగులను చూసేవారు లేరని; నీళ్లు త్రాగితే ఏదైనా జరగవచ్చు. కారణం సిటీ అంతా డ్రైన్ పైపులు, కొళాయి గొట్టాలు కలగలిసి, ఒక దానిలో నుంచి మరొక దానిలోకి నీటి మార్పిడి జరిగి పోతున్నది.

నగర జీవితంలోని నరకాన్ని వర్ణించాలంటే - కలకత్తా పౌరులను చూపిస్తే చాలు; వేరే వివరణ అవసరం లేదు.

పల్లెటూళ్ల పరిస్థితి మరీ దారుణం. నేను 24 పరగణాల జిల్లాలో కొన్ని గ్రామాలు చూశాను. భూసంస్కరణల వికృత దుష్ఫలితాలు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి పల్లె పల్లెలో! భూ పరిమితిని నిక్కచ్చిగా అమలు చేసి, పంపకం చేసేయడం వల్ల నగటు వ్యవసాయ కమతం సైజు తగ్గిపోయింది. కుటుంబ పంపకాలు వాటిని మరీ క్షీణింప జేశాయి. పాతిక ఎకరా, పది సెంట్ల యజమానులూ వున్నారు. భూ సంస్కరణల క్రింద వచ్చిన భూమి అమ్మకాలు నిషిద్ధం. ఫలితంగా వ్యవసాయం గిట్టు బాటు కాకుండా పోతున్నది. ఫలితంగా ట్రాక్టర్లు వాడడానికి వీలు కావడం లేదు. పశువుల పై ఆధారపడి సేద్యం చేస్తున్నారు. పురాతన కాలంలో వలె గొర్రు పద్ధతిలో నాట్లు వేస్తున్నారు. ఎకరాకు దిగుబడి 60 కిలోల బస్తాలు, 40 లోపే! పేదవాడు తన స్వంత కయ్యలో పండించే ధాన్యంతో బ్రతకలేరు; రైతులు బలహీనులై పోయారు కాబట్టి పొలం పనులు లేవు. కొనుగోలు శక్తి నశించి పోయింది. దరిద్రం తాండవిస్తున్నది. ఒక్కరి ఒంటి మీద చొక్కా లేదు.

ప్రభుత్వ పరంగా కూడా అభివృద్ధి అన్నది లేదు. ఒక్క పక్కా ఇంటి కాలనీ కన్పించలేదు; సరైన రోడ్లు లేవు; కరెంట్ వసతి సక్రమంగా లేదు. ఆంధ్రప్రదేశ్, తమిళ నాడు, కేరళ వంటి రాష్ట్రాలలోని పల్లెలను చూసి, వాటిని చూస్తే ఎంత తేడా అన్పించింది. విస్కీ, బ్రాందీ, సారాయిలు ఏరులై పారుతున్నాయి. రేషన్ బియ్యం మాత్రం క్రమం తప్పకుండా ఇస్తున్నారు.

ఇంచు మించు పాతికేళ్లు కమ్యూనిస్టుల పరిపాలనలో వున్న రాష్ట్రంలో, నగరంలో ఇటువంటి పరిస్థితు లుంటాయంటే నమ్మలేము. ప్రజలను నిరుపేదలుగా వుంచి, రేషన్ బియ్యంతో బిచ్చగాళ్లుగా మార్చి, గూండాగిరితో ఓట్లు జపురు కోవడం తప్ప ఇటు పల్లెలు, అటు పట్టణాల అభివృద్ధికి కమ్యూనిస్టు ప్రభుత్వం చేసిన, చేస్తున్న కృషి అంటూ ఏదీ కన్పించలేదు. భూ సంస్కరణలు నిక్కచ్చిగా అమలు చేస్తే పల్లెల ఆర్థిక వ్యవస్థ ఎంత ఛిద్రమై పోతుందో అక్కడ చూసి తెలుసుకోవచ్చు.

## తుఫాన్

5పేజీ కొరవ

దృష్టిలో చావులు కాబోలు. ప్రాణం పోలేదు కాని, రైతుకు తతిమా అన్నీ పోయాయి. అధికారులు ఆ సూక్ష్మం గ్రహించలేక పోవడం దారుణం.

జిల్లా మంత్రి సైతం అడ్రసు లేదు. ఆయనా కలెక్టరు నివేదిక చదివి సుఖంగా రాజధానిలోనే వుండి పోయారు.

రైతు సంఘాలు, బిజెపి నాయకులు, పత్రికలు గలభా చేసిన తర్వాత కాని కలెక్టర్ గారిలో చలనం రాలేదు. అప్పటికప్పుడు వ్యవసాయ శాఖ నుంచి "వివరాలు" సేకరించి 22 కోట్లని ప్రకటించారు నష్టం. ఇళ్లలో నుంచి కదలకుండా పూర్లకు పోకుండా ఆఫీసుల్లో కూర్చొని వూహించి వ్రాసిన ఆ "వివరాలు ఎంతటి నిజాలైనవో" వేరే చెప్పాలా..

* * *

జిల్లాలో అధికంగా వాన కురిసింది, ఎక్కువగా నష్ట పోయింది కావలి ప్రాంతం; ఆ తర్వాత కోవూరు, నెల్లూరు తాలూకాలు. మొత్తం 11 చెరువులు తెగాయి. 10 రోడ్లు దెబ్బ తిన్నాయి.

రైతులకు ఇప్పుడు అన్నిటికంటే పెద్ద సమస్య తడిచిన ధాన్యం అమ్ముకోవడం మద్రాసుకు స్వేచ్ఛగా పంపుకొని అమ్మే వసతి కల్పిస్తే రైతులు కొంతలో కొంత నష్టం పూడ్చుకో గల్గుతారు. ముఖ్యమంత్రి ఆ ఉదార నిర్ణయం తీసుకుంటాడనే ఆశిద్దాం!

వాన విచారింపుల్లో బిజెపి ముందు నిల్చింది. ఆ పార్టీకి చెందిన శాసన సభా పక్ష నాయకుడు శ్రీ విద్యాసాగర రావు సర్వేపల్లి ప్రాంతంలోని గ్రామాలు తిరిగి రైతులను పరామర్శించి వెళ్లారు. తెలుగు నాయకుల్లో హరికృష్ణ ఒక్కరే వచ్చారు. పెద్దగా నష్టం లేదని కలెక్టర్ నివేదిక పంపడం వల్ల ఎన్టీ రామారావు గాని, రెవిన్యూ మంత్రి కాని రాలేదు.

## నెల్లూరు ముచ్చట్లు

6పేజీ కొరవ

### శుభప్రదమ్మ వర్ధంతి

కస్తూరిదేవి బాలికల పాఠశాలకు దీర్ఘకాలం కరస్పాండెంట్‌గా పనిచేసిన స్వర్గీయ కట్టమంచి శుభప్రదమ్మ ప్రథమ వర్ధంతి 15 తేది టౌన్‌హాల్‌లో జరుగుతుంది.

### మరణం

నవ్వుతూ, నవ్విస్తూ తిరిగే అరమరికలు లేని స్నేహితుడు, కుండ బ్రద్దలు కొట్టినట్లు మాట్లాడే నిర్మొగమాటి, యునైటెడ్ మొజాయిక్స్ ఇండస్ట్రీ అధినేత, జమీన్‌రైతుకు ఆప్త బంధువు శ్రీ దేవర్ల శేషురెడ్డి తల్లి తులశమ్మ (93) పండు జీవితం గడిపి, 1 తేది మోడేగుంటలో మరణించారు. ఆమెకు ఐదుగురు కుమారులు, ఆరుగురు కుమార్తెలు. వారి కుటుంబానికి మా సానుభూతి.

### షేర్లు, రొయ్యలు- స్థలం చాలలేదు!

స్థలాభావం వల్ల ఈ వారం సంచికలో షేర్ మార్కెట్ పైన, రొయ్యల పరిశ్రమ సంక్షోభం పైన ప్రచురించాల్సిన ప్రత్యేక వ్యాసాలు ఇవ్వడం లేదు. పాఠకులు గమనించ మనవి.

-సం.

## పంచాంగం

### ముహూర్తములు

14 తేది ఆదివారం ఉదయం 8.48 గంటలకు మిధున లగ్నమున వివాహ వ్యాపార ప్రారంభములకు సుముహూర్తము లున్నవి.

### మే తిథులు

వైశాఖ శుద్ధ

తే 13 శని త్రయోదశి ఉ.గ. 6.22వ తరువాత చతుర్దశి పూర్తిగా

తే 14 ఆది పూర్ణిమ రా.గ. 3.10వ

వైశాఖ బహుళ

తే 15 సోమ పాడ్యమి రా.గ. 12.20వ

తే 16 మంగళ విదియ రా.గ. 9.52 వ

తే 17 బుధ తదియ రా.గ. 7.23వ

తే 18 గురు చతుర్థి సా.గ. 5.00 వ

తే 19 శుక్ర పంచమి సా.గ. 3.00 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

## నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి | 19.3అ |
| సర్వేపల్లి | 8.8అ |
| నెల్లూరు చెరువు | 16.4అ |

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | | |
| | 9672 | 4,100/- |
| | 9674 | 4,600/- |
| ఐ.ఆర్. 20 | | 3,200/- |
| బియ్యం (70కి) | | 500/- |

## SALE NOTICE

### నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

E.P. No. 52 of 93

O.S. No. 174 of 92

కనుమూరు ధనమారెడ్డి

-డి.హెచ్.ఆర్/వాది

Vs

పగడాల రమణారెడ్డి

-జె.డి.ఆర్./ప్రతివాది

పై నంబరున డిక్రీ హోల్డరు తన డిక్రీ బాకీని రాబట్టు నిమిత్తము. ఈ క్రింద కనపరిచిన షెడ్యూలు దాఖలా జడ్జిమెంటు డెటారు యొక్క స్థిరాస్తిని, పై కోర్టులో 5.6.1995తేది నందు ఉదయం 10.30 గంటల నుండి సాయంత్రం 5.00 గంటలలోగా వేలము వేయుదురు. కొనదలచిన వారు కోర్టుకు వచ్చికొన వచ్చును.

### షెడ్యూలు

నెల్లూరు డిస్ట్రిక్ట్ రిజిస్ట్రేషన్ యిందుకూరుపేట సబ్ రిజిస్ట్రేషన్, తోటపల్లి గూడూరు మండలం, వెంకన్న పాలెం గ్రామంలోని కోరుమాగాణి.

| పట్టా నం. | స.నం. | విస్తీర్ణం య.సెంట్లు |
|---|---|---|
| 99 | 57 B | 0.05 |
| 99 | 59 B | 1.96 |
| 33 | 59 C | 1.83 |
| 59 | 59 A | 0.25 |
| 33 | 10 A | 1.06 |
| 33 | 10 E | 0.07 |
| 33 | 60 | 1.08 |
| 33 | 61 C | 0.74 |
| | మొత్తం | 7.04 లు |

యిందుకు హద్దులు: తూర్పు: అక్కయ్య గారి మీరయ్య భూమి కొంత వరకు; దుంపల నాగయ్య భూమి కొంత వరకు; దక్షిణం: బిరుదవోలు కృష్ణారెడ్డి రమణమ్మ వగైరాల భూమి; పడమర: యినసాక శేషారెడ్డి భూమి; ఉత్తరం: యినసాక రామిరెడ్డి భూమి.

మార్కెట్టు విలువ - రూ. 40,000/-

అమీనా విలువ - రూ. 70,000/-

బి. శ్రీనివాస రావు.

అడ్వకేట్, పత్తేఖానపేట, నెల్లూరు

## జిల్లావార్తలు

# యానాదిరెడ్డి ఉడుం పట్టు ఫలించాలి!

మంచి నీటికి ఎల్లప్పుడూ కట
లాతే జాబితాలో కావలి పట్టణాన్ని
చ్చు. కేవలం బావుల పైనే
రపడి మంచి నీటి పథకాలు
స్తున్న కావలిలో సమ్మర్ స్టోరేజి
కు ఏర్పాటు కోసం శాసన సభ్యుడు
యానాది రెడ్డి ఏళ్ల తరబడి
టం చేసి చివరకు సాధించారు.
కోట్ల రూపాయలు ఖర్చయ్యే ఆ
నికి మొదటి విడతగా 40 లక్షలు
ూరయ్యాయి. వాటిలో 31 లక్షల
ాయలు అటవీ శాఖకు చెల్లించి
క్ ట్యాంకుకు అవసరమైన 110
ల భూమి సేకరించారు. ఈ నెలలో
దలైన 60 లక్షలు. మిగిలి వున్న 9
తో పనులు ప్రారంభించ నున్నట్లు
న సభ్యుడు కలికి యానాది రెడ్డి
ారు. మామూలుగా యానాది రెడ్డి ఏ
యంలోనూ పట్టు బట్టరు; పడితే
వరు. సమ్మర్ స్టోరేజి ట్యాంకు
లు పూర్తి చేయడంలో ఆయన
ం పట్టు పట్టి వున్నారు. విజయం
స్తారనే ఆశిద్దాం!

### దొంగల్లో దొర

పైకి మాత్రం పైసలున్న పెద్ద
ామే; కాని లోన దాగున్న దొంగ బుద్ధిని ఎవరు పని గట్ట గలరు. గూడూరు పోలీసులు చాకచక్యంగా వ్యవహరించడం వల్ల ఇటువంటి 'దొంగల్లోదొర' చిక్కి, తిరిగ్గా కటకటాలు లెక్క పెడుతున్నారు. నెల్లూరుకు చెందిన ఆయిల్ మిల్ ఓనర్లు బి. మాల్యాద్రి, టి. సురేంద్ర రెడ్డి విత్తనాల కొనుగోలుకు స్కూటర్ పై 1 తేది గూడూరుకు బయలు దేరారు. పంబలేరు వద్ద ముగ్గురు వ్యక్తులు ఆయన్ను ఆపి కత్తులు చూపించి మెడలోని బంగారు గొలుసు, ఉంగరాలు, వెయ్యి రూపాయల నగదు దోచుకున్నారు. స్కూటర్ టైర్లను కత్తులతో కోసి హాయిగా హైవే పై సాగిపోయారు. దోపిడికి గురైన వారు గూడూరుకు వచ్చి ఇన్‌ఛార్జి సర్కిల్ ఇన్స్‌పెక్టర్ వెంకట రమణా రెడ్డికి చెప్పగా ఏ మాత్రం ఆలస్యం చేయకుండా వైర్‌లెస్ ద్వారా దోపిడి విషయాన్ని నాయుడుపేట పోలీసులకు చెప్పి జీపులో వెంబడించారు. దుండగుల టైమ్ బాగోలేక; స్వర్ణముఖి బ్రిడ్జి వద్ద పోలీసులకు పట్టుబడి పోయారు. వీరిని విచారించి తీగ లాడితే డొంకంతా కదలింది. దుండగుల్లో ఒకరు కడపలోని సినిమా హాలు యజమాని భాస్కర రెడ్డిగా గుర్తించారు. ఈ మహాను భావుడు దారి దోపిడీ దొంగల ముఠా నాయకుడని తేలింది. తిరుపతి, మదనపల్లి, చిత్తూరు, నెల్లూరు, అనంతపురం జిల్లాల్లో జరిగిన 20 దోపిడిలకు తమ ముఠానే కారణమని భాస్కర రెడ్డి ఒప్పు కొన్నాడట. వీరి వద్ద నుంచి వంద సవర్ల బంగారు కమాండర్ జీపు, నాలుగు స్కూటర్లు స్వాధీనం చేసుకొన్నారు. ఇటీవలే గూడూరు పోలీసులు కార్ల దొంగలను పట్టుకొని తమ ఘనత చాటారు. ఇన్‌ఛార్జి సిఐ వెంకట రమణా రెడ్డి ఇదే ధోరణిలో భవిష్యత్తులో పని చేసి శాఖ పరువు పెంచాలి. ఇటువంటి వారికి ఎసిపి తగిన రీతిలో ప్రోత్సాహమందిస్తే బాగుంటుందేమో!



### ప్రకటన

దు మూలకముగా యావన్మందికి
ుపడ చేమనగా నెల్లూరు మునిసిపా
ీలో చేరిన వేదాయపాళెం గ్రామంలో
్వే నంబరు 50/3న. నాకు 40
ంకణముల స్థలము..., పిగత 40
ంకణములు స్థలము వల్లూరు
గేశ్వర రావు వగయిరాలకు హక్కు
ిగి యున్నాము. సదరు స్థలమును
ించి మేము నెల్లూరు Ist అడిషనల్
్సిఫ్ మునసబు కోర్టులో O.S.
71/91 మరియు O.S. 26/92 ర.న.
ండి శ్రీనివాసులు, బండి చెంచు
ులు, గుంజి కోటయ్య, గుంజి
ురళిల మీద దావాలు చేసి, కేసు
రుగుతున్నది. బండి శ్రీనివాసులు,
ండి చెంచు ఓబులు, గుంజి కోటయ్య,
ంజి మురళి గార్లు పై 50/3 సర్వే
ంబరులోని. 60 అంకణములను
ుతరులకు అమ్మ వలయుననే
ద్దేశ్యముతో వున్నారు. ఎవరయినా
దరు స్థలమును పై వార్త వద్ద నుండి.
ొనుగోలు చేసిన అది చెల్లదు. కావున
తెలుపడ మయినది.

**వేగూరు గోపాలకృష్ణమూర్తి**
16/1697, రామమూర్తి నగరు
నెల్లూరు - 524 003.

### గూడూరు చౌక డిపో డీలర్ దౌష్ట్యం!

గూడూరులోని 19వ నంబరు చౌక డిపో డీలర్ సుగుణమ్మ ప్రజల పై దౌష్ట్యాన్ని ప్రదర్శిస్తున్నారు. సకాలంలో సరకులు పంపిణీ చేయకుండా ప్రజలను నానా ఇబ్బందులు పెడుతుందట. నెలలో రెండు, మూడు రోజులు మాత్రమే డిపోను ఏదో ఒక సమయంలో నామకే వాస్తే తెరచి మూసేస్తుందట. ఎవరైనా అడిగితే నానా తిట్లు తిట్టి, రౌడీలతో కొట్టిస్తా నంటుందట. ఈ డిపోలో పనిచేసే వ్యక్తి సరకుల కోసం వచ్చే మహిళలను నానా రకాలుగా వేధిస్తున్నాడట. పెక్కు ఫిర్యాదులున్న ఈ దుకాణానికి ఇంతకు ముందు ఒకసారి సీల్ వేశారు. కాని రెవిన్యూ అధికారులకు లంచాలిచ్చి తిరిగి షాపును తెరిచారు. నెల నెల మామూళ్లు ఇస్తున్న తన వద్దకు ఏ అధికారి వచ్చి విచారణ చేస్తారో చూస్తానని శపథాలు చేస్తుంది. పలువురు ప్రజల కార్డులు కూడా ఆ మాట ఈ మాట చెప్పి జబర్దస్తీగా ఈమె తన వద్ద వుంచుకొన్నట్లు తెలిసింది. ఆర్డీవో గారు ఈ స్పెషల్ కేసు మరొకసారి విచారిస్తే బాగుంటుందేమో!

ఈ పిచ్చి ప్రజల ధ్యాస అధిక ధరలు, కరెంటు-కోత, నీటి ఎద్దడి, మద్యం స్మగ్లింగు, అక్రమాలు లాంటి వాటి వైపు మరలకుండా 'టెక్కలి' సీటు లాంటి ట్రిక్ ఏదైనా ఆలోచించు పార్వతీ!!

LAXMAREDDY

# అలంకార ప్రాయం ఎస్టీడీ సౌకర్యం

రాపూరుకు ఎస్టీడీ ఫోన సౌకర్యం అలంకార ప్రాయ మయ్యింది. ఈ సౌకర్యం కల్పించి నాలుగు నెలలు అవుతున్న ఉపయోగించుకొన్న పుణ్యాత్ముడు లేడు. ఏ రోజూ లైన్ బాగుండదు. ఈ స్థితి ఎప్పుడు మారుతుందని స్థానిక అధికార్లను అడిగితే పొదలకూరు ఎక్స్ఛేంజి వారిని అడగమని సమాధానం చెబుతారే తప్ప చక్కదిద్దరు. ట్రంకాల్స్ బుకింగ్ కూడా ఇదే రీతిన ఏడుస్తున్నది. నూరు మందికి పైగా వినియోగ దారులు తమ[...] అలంకార ప్రాయంగా ఫోన్లు పెట్టుకొనేట్లు చేసిన టెలిఫోన్ శాఖాధికారులను నానా శాపనార్థాలు పెడుతున్నారు.

### పూర్తికాని వంతెనలతో ప్రజల అగచాట్లు!

రాపూరు మండలంలోని పంగిలి గ్రామంలోకి వెళ్లేందుకు వీలుగా వుండే వంతెన పనిని సంవత్సరం నుండి చేపట్టక పోవడం వల్ల గ్రామస్తులు పడరాని పాట్లు పడుతున్నారు. గత సంవత్సరం కురిసిన భారీ వర్షాలతో వెలుగొండ వాగుకు వచ్చిన వెల్లువకు ఈ వంతెన కొట్టుక పోయింది. మరుసటి నెలలోనే రోడ్లు భవనాల శాఖాధికారులు టెండర్లు పిలిచి కాంట్రాక్టర్‌కు పని అప్ప జెప్పారు. కాని కాంట్రాక్టర్ ఆ పని పట్ల శ్రద్ధ చూపించలేదు. ఈ వారంలో కురిసిన వర్షాలకు వాగు పరవళ్ళు త్రొక్కడంతో రాపూరుకు పంగిలి గ్రామంతో సంబంధాలు తెగిపోయాయి. గ్రామానికి నడిచే ఆర్టీసీ బస్సును అధికారులు నిలిపేశారు. గ్రామస్తులు కాలి నడకన రాపూరుకు నడచి రావల్సిన దుస్థితి దాపురించింది. రాబోయే వర్షాకాల మంతా ఈ బాధలు తప్పవేమోనని పంగిలి గ్రామస్తులకు ఇప్పటి నుండే దిగులు పట్టుకొన్నది. రోడ్లు భవనాల శాఖాధికారులు తగిన శ్రద్ధ వహించి కాంట్రాక్టరును మార్చి బ్రిడ్జి నిర్మాణాన్ని సత్వరం పూర్తి చేయవలసి వుంది.

### కావలి దాహం తీర్చిన అకాల వర్షం!

మండే మండు వేసవిలో అకాలంగా భారీ వర్షాలు కురియడంతో కావలి పట్టణం పారిశుధ్య విషయమై గబ్బు కొట్టినా, మంచి నీటి సమస్య మాత్రం తీరింది. వర్షాలకు కావలి చెరువు, మందార చెరువు, ముసునూరు చెరువు, పాసిరెడ్డి చెరువులు నీటితో పుష్కలంగా నిండి పోయాయి. టౌన్‌లో నీరులేక అడుగంటిన మంచి నీటి బావులు నిండడంతో ప్రజలు వూపిరి పీల్చుకొన్నారు. కాని విచిత్రమైన విషయ మేమిటంటే బావుల్లో ఏర్పాటు చేసిన మోటార్లు నీటితో మునిగి పోవడం వల్ల 7, 8, 9, 10 తేదీల్లో కావలి టౌన్‌కు మంచి నీటి సరఫరా జరగలేదు.

### జిల్లాలో వర్షపాతం

జిల్లాలో 6, 7, 8, 9 తేదీలలో కుండపోతగా వర్షం కురిసింది. జలదంకిలో అత్యధికంగా 549.2 మి.మీ, మర్రిపాడులో అత్యల్పంగా వర్షం పడింది. వివిధ మండలాల్లో కురిసిన వర్షపాత వివరం దిగువ ఇస్తున్నాం

| | |
|---|---|
| జలదంకి | 549.2 మి.మీ |
| కావలి | 534.4 మి.మీ. |
| తోటపల్లి గూడూరు | 515.8 మి.మీ. |
| ముత్తుకూరు | 505.7 మి.మీ. |
| బోగోలు | 504.4 మి.మీ. |
| ఇందుకూరుపేట | 496.2 మి.మీ |
| దగదర్తి | 479.6 మి.మీ |
| అల్లూరు | 475.2 మి.మీ |
| కోవూరు | 441.0 మి.మీ |
| నెల్లూరు | 430.6 మి.మీ |
| కలిగిరి | 375.4 మి.మీ |
| కొండాపురం | 373.3 మి.మీ |
| విడవలూరు | 339.3 మి.మీ |
| వరికుంటపాడు | 333.2 మి.మీ |
| కొడవలూరు | 326.6 మి.మీ |
| వెంకటాచలం | 323.6 మి.మీ |
| పొదలకూరు | 297.0 మి.మీ |
| వింజమూరు | 291.0 మి.మీ |
| ఉదయగిరి | 279.6 మి.మీ |
| చేజర్ల | 264.2 మి.మీ |
| వెంకటగిరి | 252.2 మి.మీ |
| గూడూరు | 246.8 మి.మీ |
| రాపూరు | 229.8 మి.మీ |
| ఓజిలి | 216.8 మి.మీ |
| చిల్లకూరు | 211.6 మి.మీ |
| సైదాపురం | 210.4 మి.మీ |
| దక్కిలి | 209.2 మి.మీ |
| బాలాయపల్లి | 204.6 మి.మీ |
| వాకాడు | 204.3 మి.మీ |
| సీతారామపురం | 198.1 మి.మీ |
| తడ | 194.0 మి.మీ |
| ఆత్మకూరు | 191.9 మి.మీ |
| చిట్టమూరు | 193.8 మి.మీ |
| కోట | 188.5 మి.మీ |
| పెళ్ళకూరు | 179.1 మి.మీ |
| నాయుడుపేట | 171.9 మి.మీ |
| సూళ్ళూరుపేట | 151.7 మి.మీ |
| కలువాయి | 139.2 మి.మీ |
| మర్రిపాడు | 136.2 మి.మీ |

## పెళ్ళకూరు

5పేజీ కొరవ

పని అడిగితే మాత్రం పట్టించు కోరు. ఆయన ప్రధానితో తనకు గల సాన్నిహిత్యాన్ని ఎవరి కోసమూ దుర్వినియోగం చేయలేదు. గతంలో ఇఫ్‌కో ఛైర్మన్లుగా వుండిన వారు కోట్లు సంపాదించారు; కాని పెళ్ళకూరు పది రూపాయలు ఆర్జించలేదు; ఇఫ్‌కోకు మాత్రం 300 కోట్ల లాభం చేకూర్చారు. ఇఫ్‌కో ఫ్యాక్టరీ కడుతున్నా రంటే ఆయన ప్రతిభ అర్థం చేసుకోవచ్చు అన్నారాయన.

పువ్వు పుట్టగానే పరిమళించినట్లు రామచంద్రా రెడ్డి గారు యవ్వన దశల నుంచి రాజకీయాలలో రాణిస్తూనే వున్నారన్నారు. ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ ఎల్.వి. ప్రసాద్. దానకర్ణులకు ఆస్తి అవసరం లేదు, సుగుణాలు వుంటే చాలు; అటువంటి వ్యక్తిత్వం కల్గిన వారు రామచంద్రారెడ్డి గారు అన్నారు శ్రీ డి. ఆదిశేషారెడ్డి.

పంచాయితీ బోర్డు సర్పంచ్‌గా జీవితం ప్రారంభించి, దేశ స్థాయి కల్గిన సంస్థకు అధిపత్యం వహించడం అభినందనీయ మన్నారు శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి.

రామచంద్రా రెడ్డి గారు తన సన్మానానికి కృతజ్ఞతలు చెప్తూ, లంచగొండి తన మంటే తనకు అసహ్యమని, ఆ తీరులోనే జీవితాంతం వుండిపోతానని అన్నారు. తాను పివిని దేముడిగా భావించి చేస్తున్న పూజలే తాను అధిపత్యం వహిస్తున్న సంస్థను కాపాడుతున్నా యని చెప్పారు. సభకు డాక్టర్ సివింకె వ్యాఖ్యాతగా వ్యవహరించారు. నిప్పో అధినేత శ్రీ పి. ఓబులరెడ్డి, మద్రాసు ముఖ్యులు శ్రీ ఎ. ఎస్. రెడ్డి, శ్యామ సుందర రెడ్డి, అల్లారెడ్డి వెంక కృష్ణరెడ్డి రెడ్డి, ఆంధ్రభూమి వెంకట్రామ రెడ్డి, మాజీ ఇఫ్‌కో ఎండి మల్లాది అవధాని తదితరులందరూ సభలో పాల్గొన్నారు.


దేశద్రోహులు చిత్రంలో భానుచందర్, శ్వేత

# మీనాకు గర్వమా?

"పుణ్యభూమి నా దేశం" చిత్రంలో చాలా మంచి పేరు వచ్చిందమ్మాయ్" అని మీనాతో ఒకరు అంటే "మంచి పేరును నేను నా మొదటి తెలుగు చిత్రంతోనే తెచ్చుకున్నాను. ఇక కొత్తగా వచ్చే మంచి పేరు ఏముంది?" అంది. మంచి పేరును నిలబెట్టు కోవడమంటే ఏమిటో మీనాకు తెలియదా?

## విజయా గార్డెన్స్‌లో "జేబులో బొమ్మ"

శ్రీ సాయి శ్రీనివాస ఫిలిమ్స్ వారి "జేబులో బొమ్మ" చిత్రానికి మే 4 వ మద్రాసులో ప్రారంభోత్సవం జరిగింది. దాసరి నారాయణ రావు, లక్ష్మి, తనికెళ్ళ భరణి, ఎ.వి.ఎస్. నటించే ఈ చిత్రానికి సంగీతం: మాధవపెద్ది సురేష్, మాటలు: ఎం.వి.ఎస్. హరనాథ రావు, దర్శకత్వం: భాస్కర్.

# 'తెలుగు సినిమా తీసే సాహసం నాకు లేదు'

"తెలుగులో నన్ను పాత కాలపు చాదస్తపు దర్శకుడి కింద జమ కట్టేశారు. కన్నడంలో నా మార్కెట్‌కు ఢోకా లేదు. నేను కన్నడంలో దర్శకత్వం చేసి విజయ వంతమైన "నన్న ప్రతిజ్ఞ" చిత్రాన్ని "కసాయి మనిషి" పేరుతో తెలుగులో ఒకరు డబ్ చేసి, త్వరలో విడుదల చేయబోతున్నారు. తెలుగులో స్ట్రెయిట్ చిత్రాలు తీసి విడుదల చేయడానికి నేను సాహసించ లేక పోతున్నాను" అన్నారు కె.ఎస్.ఆర్. దాస్. "కసాయి మనిషి" చిత్రంలో విష్ణువర్ధన్, అహల్య హీరో, హీరోయిన్లు.

## పి.బి. శ్రీనివాస్‌కు 'సిరికంఠశ్రీ' బిరుదు

ఒకప్పుడు తెలుగులో నేపథ్య గాయకుడు పి.బి. శ్రీనివాస్ ఎంతో బిజీగా ఉండే వారు. ఇప్పుడు తెలుగులోనే కాక తమిళ, మలయాళ భాషల్లో కూడా ఎవరికీ పాడటం లేదు. ఇందుకు కారణ

మేమిటని ఆయన్ని అడిగితే "కాల మహిమ" అంటారు నవ్వుతూ. ఈయన గాయకుడే కాక కవి. బహు భాషా కోవిదుడు. ఈయన్ని మరువనిది కన్నడ

చిత్ర పరిశ్రమ మాత్రమే. అడపా దడపా కన్నడ చిత్రాలలో కొందరికి పాడుతుంటారు. ఇటీవల ఈయనకు 'సర్వజ్ఞ కళానికేతన సంఘం' బెంగుళూరులో ఘన సన్మానం చేసి "సిరి కంఠశ్రీ" అనే బిరుదును ప్రధానం చేసింది.

# ముఖ్యమంత్రి ఏదో రాయితీ ఇస్తాడని సినిమా పరిశ్రమ ఆశ!

నంది అవార్డులను త్వరలోనే ప్రభుత్వం ప్రకటిస్తుందని విశ్వసనీయంగా తెలిసింది. ఈ అవార్డులు అత్యుత్తమ చిత్రాల నిర్మాణానికి ప్రోత్సాహకారిగా ఉండటం లేదని తెలిపోయింది. కాని, రాయితీల గురించి ముఖ్యమంత్రి ఏమైనా ప్రకటిస్తారని ఆశతో ఉంది సినిమా రంగం.

కేరళ ప్రభుత్వం ఎలాంటి పన్నుల రాయితీలు ప్రకటించలేదు. ఆంక్షలు విధించలేదు. మలయాళ చిత్రాలను ఏ రాష్ట్రంలోనైనా తీసుకోవచ్చు. అందుకే వాసిలోనూ, రాశిలోనూ కేరళ చిత్ర పరిశ్రమ పరిస్థితి మెరుగ్గా ఉంది. కర్నాటక ప్రభుత్వం సినీ కార్మికులకు గృహవసతి, ఇళ్ల స్థలాలు కేటాయించ లేదు. కాని, భాషాభిమానంతో నటీనటులు మాత్రం అక్కడే స్థిరపడ్డారు. ఐతే, కేరళ చిత్ర ప్రముఖులందరూ ఒక మంచి పనిచేశారు. అందరూ కలిసి అన్ని హంగులూగల ఒక స్టూడియోను ఏర్పాటు చేసుకోవటం వల్లనే మలయాళ చిత్ర పరిశ్రమ అటు తరలి వెళ్లింది. గతంలో రాయితీలతో బంగారు పంట పండించు కోవచ్చన్న ఉద్దేశ్యంతోనే తెలుగు నిర్మాతలు చాలా మంది హైద్రాబాద్‌కు తరలి వెళ్లారు. రాయితీలు, సబ్సిడీల మూలంగా తారలు, సాంకేతిక నిపుణు లందరూ రేట్లు పెంచేశారు. ఆంధ్ర రాష్ట్రంలోనే షూటింగ్‌లు జరగాలని గిరి గీసినందువల్ల నాణ్యతా ప్రమాణాలు లోపించి, చిత్రాలు అధికంగా అపజయాలను చవిచూశాయి. సామాన్య ప్రేక్షకుడికి అవసరమైన కథ, వైవిధ్యం గల కథనం - అనే సరకులను దర్శకులు మరచి పోయారు. అందుకే వరుసగా ఫ్లాపులు "పరిశ్రమ నుంచి హాహాకారాలు" ఎఫ్‌డిసి ప్రముఖుల వింత ధోరణి.. ఎన్నో సమస్యలు విలపిస్తుంటేనే పరిశ్రమ ఎప్పుడు అధిగమిస్తుందో?

## ఎ. కోదండ రామరెడ్డి బదులు విజయనిర్మల

కోదండరామి రెడ్డి చాలా బిజీగా ఉండటం చేత ఒక కన్నడ చిత్రం ఆధారంగా జి.ఆర్.కె. రాజా సారథ్యంలో కృష్ణ సమర్పించే చిత్రానికి విజయ నిర్మల దర్శకత్వం వహిస్తున్నారు. కృష్ణ, సౌందర్య, చంద్రమోహన్, శ్రీహరి, సుధ, కవిత, పి.ఎల్. నారాయణ పాత్రధారులు. రచన: పరుచూరి సోదరులు. ఈ చిత్రానికి "పుట్టింటి గౌరవం" అనే పేరు పెట్టారు. జె.వి. సోమయాజులు, తనికెళ్ళ భరణి, ఎ.వి.ఎస్., ప్రసాద్ బాబు, జయలలిత మున్నగు వారు కూడా ఈ చిత్రంలో ఉన్నారు.

## తెలుగులో తెర వెనుక - కన్నడంలో తెర ముందు

సాయికుమార్ డబ్బింగ్ ఆర్టిస్ట్‌గానే తెలుగు చిత్ర సీమ గుర్తించింది. కాని, అతను కన్నడంలో ప్రముఖ హీరో స్థాయికి ఎదిగాడు. అతను హీరోగా నటించిన "లాకప్ డెత్" అనే




కన్నడ చిత్రం సూపర్ హిట్ అయింది. ఆ చిత్రాన్ని తెలుగులో డబ్ చేయడానికి కొందరు పోటీ పడుతున్నారు. తమాషా ఏమిటంటే సాయికుమార్ హీరోగా ఏ తెలుగు నిర్మాతా తెలుగు చిత్రం తీయరు. "ఎమర్జెన్సీ, అరుణ కిరణం, జగదీశ్వరి" వగైరా ఆరు కన్నడ చిత్రాలలో సాయి కుమార్ హీరో. వినోద్ కుమార్ వంటి కన్నడ హీరోలు ఇప్పుడు తెలుగు చిత్రాలలో బిజీ!

## మళ్లా నటించేందుకు జయమాలినికి పర్మిషన్

"తొలి ప్రసవం అనంతరం నేను మళ్ళీ సినిమాలో నటించడానికి మా వారు పర్మిషన్ ఇచ్చారు. డాన్సుల కన్నా కేరక్టర్స్ మీద నా దృష్టి నిలపాలని ఉంది. అటువంటివి వస్తే చేస్తాను. లేకపోతే హాయిగా గృహిణిగా నా బాధ్యత నిర్వహించడంలో లీనమై పోతాను" అంది జయమాలిని ఇటీవల.

## మాదాలతో కొండపల్లి నటించే "ఎర్రపావురాలు"

నవ సమాజం ఏర్పాటు చేయాలని, అది చలన చిత్రాల ద్వారా సాధ్యమని నమ్మిన మాదాల రంగారావు నటించే "ఎర్ర పావురాలు" చిత్రంలో విప్లవ యోధుడు కొండపల్లి సీతారామయ్య, నర్సింహ రాజా, జయలాల, సమత, తేజస్విని, సరస్వతమ్మ, వివిధ సంస్థలలో పని చేస్తున్న కార్మికులు, ట్రేడ్ యూనియన్ సభ్యులు కూడా నటిస్తున్నారు. హైదరాబాద్‌లోని కిరిమెట్ల ప్రాంతాలలో 'మేడే' నాడు ప్రారంభోత్సవం జరిగింది. నెల్లూరీయుడు పి. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు.

## తమిళనాడు సినీ కార్మికులకు గృహవసతి

దాదాపు 10 కోట్ల రూపాయలు విలువ చేసే 85 ఎకరాల స్థలాన్ని తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత సినిమా కార్మికుల గృహ వసతికి గాను సమర్పించింది. మద్రాసు సమీపాన పళ్లికరణై అనే చోట ఈ పొలాలున్నాయి.

# శివాజీని స్వదేశం ఎప్పుడుగుర్తిస్తుంది?

శివాజీ గణేశన్ గొప్ప నటుడు. అతనికి ఫ్రాన్స్ దేశపు అత్యున్నత పురస్కారం "చెవాలియర్" బిరుదు లభించింది. ఈ అవార్డు ప్రదానోత్సవం ఇటీవల మద్రాసులో అతి వైభవంగా జరిగింది. కాని, ఆయన్ని స్వదేశం మాత్రం గుర్తించక పోవడం శోచనీయం. అందుకు తమిళ నాడు ముఖ్యమంత్రి జయలలిత ఆయన నివాస ముంటూన్న బోగ్ రోడను చెవాలియర్ శివాజీ గణేశన్ రోడ్‌గా మార్చబోతున్నట్లు ప్రకటించింది. ఉత్తరం వైపున్న బోగ్ రోడ్ టి.ఎన్. రెడ్డి నగర్‌గా టి.ఎన్. రెడ్డి గారి స్మృత్యర్థం మార్చబడింది. అది ఆయన మరణించాకే ఆ మార్పుదల!

కొడవ 11 పేజీలో


ఇఫ్కా ఛైర్మన్ నెల్లూరు రామచంద్రారెడ్డి గారు మద్రాసు 'సవేరా' వారు చేసిన సన్మానసభలో ప్రసంగించి. మాగుంట సుబ్బరామరెడ్డి గారిని, నెల్లూరు రామచంద్రారెడ్డి గారిని పూలమాలాలంకృతులను చేస్తున్న సవేరా కంపెనీ సెక్రటరీ - ఆడిటర్ శ్రీ డి. ఆదిశేషారెడ్డి.



నెల్లూరు న్యాయవాదుల గుమాస్తాల సంఘం అధ్యక్షుడు జి. సత్యనారాయణ రావును సన్మానిస్తున్న జిల్లా జడ్జి శ్రీ ఎల్. అప్పారావు. సెక్రటరీ అన్నవరం సత్యనారాయణ

## జనవాణి

3 పేజీ కొరవ

నాయకుడి పాత్రలు పోషించడంలో ఆయనకు ఆయనే సాటి. ఈ పాత్రలు నిత్య జీవితంలో రాజకీయ నాయకుల రూపంలో మనకు కనిపిస్తూనే వుంటాయి. రక్తకన్నీరు నాటకంలో ఆయన పోషించిన పాత్ర మరొకరు పోషించలేరు. అటువంటి మహానటుడి మరణం నాటక, సినిమా రంగాలకు తీరని లోటు. ప్రతి సంవత్సరం ఉత్తమ విలన్ నంది అవార్డును నాగభూషణం పేర ఇచ్చేలా ప్రభుత్వం తగిన నిర్ణయం తీసుకోవాలి. ఏది ఏమైనా నాగభూషణం తనదైన నటన ద్వారా నెల్లూరు పేరును నిలబెట్టారు.

నెల్లూరు -పి. రవికుమార్

### సినిమాల వల్ల సామాజిక విలువలు పతనం!

'అల్లుడా - మజాకా' చిత్రం పై జమీన్‌రైతులో వ్రాసిన విమర్శ ఆలోచింప జేస్తుంది. ప్రతి వాడూ వాడి స్వార్థం గూర్చి ఆలోచించడమే గాని సమాజంలోని ప్రజలు, వారి కట్టుబాట్లు, నాగరికత గూర్చి ఆలోచించడం లేదు. మనిషి సెక్సు బలహీనతలను ఆధారం చేసుకొని నటించే మెగాస్టార్లు, మానాభిమానాలు మరచి నటించే నటీమణులు, నిర్మాతలు, వ్రాసే రచయితలను, డైరక్టర్లకు ప్రజలు తగిన రూపంలో బుద్ధి చెబితే ఇటువంటి చిత్రాలు రావు. ఆంధ్రప్రదేశ్‌లో అత్తలను గౌరవించే సంస్కృతి అనాదిగా వుంది. అల్లుడా - మజాకా చిత్రంలో మాదిరి అత్తలతో ఎవరూ ప్రవర్తించరు. చిత్రం పై వచ్చిన విమర్శల పై చిరంజీవితో పాటు నిర్మాత దేవివర ప్రసాద్ పత్రికల పై విరుచుక పడక నిదానంగా ఆలోచించి తమ దృక్పథాన్ని మార్చుకోవాలి. ఆ సినిమా ద్వారా సమాజంలో దిగజారిన విలువల గూర్చి ఆత్మ విమర్శ చేసుకోవాలి. సినిమాల గూర్చి ఏ మాత్రం తెలియక మంచి చెడు ఆలోచించి సర్టిఫికెట్లు ఇస్తున్న సెన్సార్ సభ్యులను వెంటనే బోర్డు నుంచి తొలగించాలి.

నెల్లూరు -కె. అరుణ కుమారి



### కుట్టు మిషన్లు ఇచ్చారు- శిక్షణే లేదు!

పొదుపు లక్ష్మి పథకం క్రింద నెల్లూరు రూరల్ మండలంలో గ్రామానికి ఒక్కొక్కటి చొప్పున 33 కుట్టు మిషన్లు ఇచ్చారు. కాని పని నేర్పించేందుకు ఒక్క ఇన్స్‌స్ట్రక్టర్‌నూ నియమించలేదు. దీనివల్ల మిషన్లు ఇచ్చి ప్రయోజనం లేకుండా పోయింది. వేలు ఖర్చు పెట్టి మిషన్లు తీసి ఇచ్చిన అధికారులు శిక్షణ ఇప్పించే విషయమై శ్రద్ధ తీసుకోవాలి.

ములుమూడి -వి. జానకి రామారావు

### టాడా స్థానే మరో చట్టం మంచి నిర్ణయం!

టాడా స్థానంలో మరో చట్టాన్ని ప్రవేశ పెట్టాలని కేంద్ర ప్రభుత్వం భావిస్తుండటం శుభ పరిణామం. జాతీయ మానవ హక్కుల కమీషన్ అధ్యక్షుడు రంగనాథ్ మిశ్రా టాడాను సవరించాలని అనేక సార్లు అభిప్రాయ పడ్డారు. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు బహిరంగంగానే ఈ చట్టం వద్దన్నాయి. అంతర్జాతీయ సంస్థలూ, పత్రికలూ, భారతదేశంలో మానవ హక్కుల ఉల్లంఘనకు ఈ చట్టం ఎంతగానో సహకరిస్తోందని దుమ్మెత్తి పోశాయి. కొత్తగా టాడా స్థానంలో రానున్న కొత్త చట్టం దుర్వినియోగానికి అవకాశం లేని విధంగా పటిష్టంగా తయారు చేయాలి.

గూడూరు -పి. సుందరయ్య

### కొత్త ఆర్డీవో పేరు తెచ్చుకోవాలి!

కుమారి టి.కె. శ్రీదేవి నెల్లూరు తొలి మహిళా ఆర్డీవో. ఇది వరలో తొలి మహిళా కలెక్టరుగా కుమారి సుజాతా రావు మూడు సంవత్సరాలు పని చేసి నిష్కళంకమైన అధికారిణిగా పేరు తెచ్చుకొన్నారు. అదే విధంగా శ్రీదేవి కూడా పేరు తెచ్చుకొనే విధంగా పని చేయాలి. ఏది ఏమైనా నెల్లూరు ప్రధాన కేంద్రంలో పని చేయడం కత్తి మీద సాము వంటిది. కారణం మంత్రులు, ఇతర అధికారుల పర్యటనలు ఎక్కువగా వుంటాయి. వారికి స్వాగతం చెప్పడం వీడ్కోలు ఇవ్వడం ఒక పని. దీనికి తోడు ఆఫీసు పనులు, శాంతి భద్రతల పర్యవేక్షణ చూడాలి. ఇప్పటికే డివిజన్‌లో అన్ని మండలాల్లో పర్యటించి ఆర్డీవో తన పని తీరును చాటారు. దీనికి తోడుగా మహిళా చైతన్యం గల జిల్లాలో మహిళల సర్వతో ముఖాభివృద్ధికి ఆర్డీవో తోడ్పడాలి.

నెల్లూరు -సి. శంకర దాస్

### నకిలీ మందుల తయారీ అరికట్టాలి

ప్రాణాలతో చెలగాట మాడే నకిలీ మందుల వ్యాపారాన్ని నిరోధించాలని నాలుగేళ కిందట సభా సంఘం సిఫార్సు చేసింది. కాని ఈ సిఫార్సులు ఇప్పటి వరకు అమలు చేయలేదు. తక్కువ పెట్టుబడులతో ఎక్కువ లాభాలు ఆర్జించాలన్న దురాశతో నకిలీ మందులతో మార్కెట్లలోకి ప్రవేశించే సంస్థలు ఎక్కువయ్యాయి. నగరాల్లో యధేచ్ఛగా నకిలీ మందులు అమ్ముతున్నారంటే గ్రామీణ ప్రాంతాల పరిస్థితి చెప్ప నవసరం లేదు. అధికార యంత్రాంగం నకిలీ మందులను అదుపు చేయడం పట్ల ఆసక్తి చూపడం లేదు. ప్రభుత్వంలోని అధికార, అనధికార వర్గాలు నకిలీ మందుల తయారీ దారులతో కుమ్మక్కయి ఈ దుస్థితిని సృష్టించాయి. దీనిని వెంటనే అరి కట్టాలి. లేకుంటే ప్రభుత్వ చిత్తశుద్ధిని శంకించ వలసి వస్తుంది.

నెల్లూరు -కె. విజయ

## నెల్లూరు సంగతులు

4 పేజీకొరవ

మిగిలిందన్నారు. నేతలు కార్మికులను ఆదుకోకుండా వారి బాధలను వేడుకగా చూస్తున్నట్లు విమర్శించారు. కార్యక్రమంలో నెల్లూరు, కోవూరు, బుచ్చి, మండలాధ్యక్షులు పి. దశరధ రామయ్య, పి. సుబ్రహ్మణ్యం, ఎం. ఇందిరావతి, పి. జయరామయ్య పలువురు మండల, జిల్లా ప్రాదేశిక నియోజక వర్గాల సభ్యులు పాల్గొన్నారు.

### గ్రంథావిష్కరణ సభ

వర్ధమాన సమాజం 6 తేది 'శ్రీలక్ష్మి కనకధార - భజగోవిందమ్' గ్రంథావిష్కరణ సభను టౌన్‌హాల్‌లో ఏర్పాటు చేసింది. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. ఆది శంకరాచార్యులు మానవాళిని ముక్తి మార్గంలోనికి నడిపించడానికి, జ్ఞాన సంపన్నులను చేయడానికి భారతదేశం నలుమూలలా జ్ఞాన పీఠాలను నెలకొల్పారు. నాటి నుంచి ఈ నాటి వరకు అధ్యాత్మిక వికాసాన్ని మఠాల ద్వారా ప్రచారం కొనసాగిస్తున్నట్లు వివరించారు. మాజీ జిల్లా పరిషత్ ఛైర్మన్ మేనకూరు గోపాలకృష్ణా రెడ్డి, నేలనూతల రామ్మూర్తి ఆంధ్ర, ఆంగ్ల పద్యాను వాదాలు రచించిన లక్ష్మి కనక ధార భజగోవింద స్తోత్రములు గ్రంథాన్ని ఆవిష్కరించారు. గ్రంథకర్త కావ్యకన్యను ఇఫ్కో ఛైర్మన్ పెల్లకూరు రామచంద్రా రెడ్డికి అంకిత మిచ్చారు. సభారంభంలో ప్రభుత్వ సంగీత నృత్య కళాశాల విద్యార్థినులు మైథిలి, భవాని భక్తి గీతాలాపన చేశారు. సభకు సమాజం అధ్యక్షుడు పి.వి. రమణా రెడ్డి అధ్యక్షత వహించగా కార్యదర్శి బి.వి. నరసింహం చివరన వందనాలు చెప్పారు.

### కార్మికులకు పెరిగిన వేతనాలు!

కార్మిక కమీషనర్ వివిధ పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులకు 95 సంవత్సరం ఏప్రెల్ నుంచి జీవన వ్యయ భత్యం పెంచుతూ ఆదేశాలు జారీ చేశారు. దీనివల్ల యాజమాన్యాలు ఇప్పుడు చెల్లిస్తున్న కార్మికుల వేతనాలకు 279 పాయింట్లు జీవన వ్యయ భత్యంలో కలిపి చెల్లించాలని సహాయ కార్మిక కమీషనర్ టి. యాదగిరి తెలియ జేస్తున్నారు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

రాయప్రోలు రామమూర్తి గారికి కొద్దిగా జబ్బు చేసి కన్యకా పరమేశ్వరికి ముడుపు గట్టుకోగా నెమ్మదించినది.

* * *

నెల్లూరు జిల్లాలో రెండు పింగాణీ ఫ్యాక్టరీలు, ఒక గ్లాసు ఫ్యాక్టరీ, ఒక యెముకల పొడి ఫ్యాక్టరీ, దానికి సంబంధించి ఒక సాంబ్రాణి తయారు జేసె ఫ్యాక్టరీ నిర్మింపబడినవి. కొన్ని నిర్మింప బడనున్నవి. సంతోషం.

కూలీలు ఉదయగిరి, కనిగిరి, కందుకూరు ప్రాంతాల నుండి పరాయి దేశం వెళ్తున్నారు కూడు లేక వారినంతా యీ ఫ్యాక్టరీలకు మళ్లించండి.

* * *

జిల్లా కలెక్టరు వర్గీస్ గారు మరి 15 రోజులు శలవు పెట్టిరి. అంత వరకు యిప్పుడున్న విరూపాక్ష శెట్టి గారే వుంటారు. తర్వాత శెట్టి గారు తూర్పు గోదావరికి పోతారు.

### బజారు ధరలు

| | | |
|---|---|---|
| కొత్త ములగొలుకులు | 142 | 00 |
| మట్టి పిషాణాలు | 132 | 00 |
| రాగులు | 170 | 00 |
| జొన్నలు | 195 | 00 |
| సజ్జలు | 200 | 00 |
| వులవలు తూము 1 కి | 11 | 40 |
| పెసలు (108 శేర్లు) | 24 | 00 |
| మినుములు | 25 | 00 |
| బంగారం సవర 1కి (మద్రాస్) | 49 | 130 |
| వెండి తు 1కి | 1 | '46 |

In the Court of the Subordinate Judge : Nellore
E.P. No. 11 of 1989
O.S. No. 100 of 1985
Ponnaluru Kodandarami Reddy - Petitioner / DHr
Vs
Anumareddy Gopal Reddy alias Venkata Raja Gopal Reddy - Respondent / JDr

**ప్రకటన**

ఇందు క్రింద వివరించిన షెడ్యూలు దాఖలా ప్రతివాది తాలూకు స్థిరాస్తిని పై కోర్టు వద్ద 3.7.1995 తేది ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 5 గంటల లోపల బహిరంగముగా వేలము జరుపబడునని యిందు మూలముగా తెలియజేయడ మైనది.

**షెడ్యూలు**

Nellore District Registration - Nellore Sub Registration - Nellore Taluk - wetlands situated in Gundlapalem Village
P.No. S.No.
120 195/1 full extent Ac. 2.01 extent owned Ac. 2.01 (0.811 H)
DHr Value Rs. 30,000/-
Amin's Value Rs. 30,100/-
N.B. పై ఆస్తి మీద ఎలాంటి పరాధీనములు లేవు.
Date : 5.5.1995

జి. ఆదిశేషారెడ్డి
అడ్వకేటు, నెల్లూరు

## నీరసమైన కథకు జీవం పోశారు!

# ఘరానా బుల్లోడు

"ఘరానా బుల్లోడు" చిత్రం కొలువున కథ ఘరానాగా లేదు. పాత ధోరణిలో సాదాగా వుంది. ఈ కథ వ్రాసిన విజయేంద్ర ప్రసాదే మాటలు కూడా వ్రాశారు. మాటలు చాలా నీరసంగా వున్నాయి. ఒక ఫైవ్ స్టార్ హోటలు ముందున్న కాలనీ వాసులను ఖాళీ చేయించి ఆ హోటలుకు మంచి అంద చందాలు కల్పించాలనుకున్న అంశం కథలో ముఖ్య స్థానం అలంకరిస్తుంది. గుడిశెలను ఖాళీ చెయ్యించటమనే అంశం చాలా చాలా పాతది. ఈ పాత సాదా కథకు నీరసమైన మాటలకు దర్శకుడు కె. రాఘవేంద్ర రావు జీవం పోశాడు. కథలోని సన్నివేశాలకు వినోదాన్ని జోడించి చక్కని దృశ్య రూపాన్ని కల్పించాడు. వేటూరి, జొన్నవిత్తుల, భువన చంద్ర వ్రాసిన పాటలకు సంబంధించిన దృశ్యాలను కూడా ఖుషీగా చిత్రీకరించాడు. "పాలు కావాలా వుఖిపాలు కావాలా" "ఏం కసి, ఏంకసి ముద్దో ముద్దు" ఈ పాటల దృశ్యాలను వినోద భరితంగా, శృంగార పరంగా రసరమ్యంగా ప్రేక్షకుల ముందు నిలిపాడు దర్శకుడు. పాటల దృశ్యాలను ఆకర్షణీయంగా అహ్లాద కరంగా చిత్రీకరించటంలో కె. రాఘవేంద్ర రావు అంటె వేసిన చెయ్యి కదా! ఆయన చెయ్యికి కీరవాణి సంగీతం ఎస్. గోపాల రెడ్డి కెమెరా చక్కని చేయూత నందించాయి. వీరి ముగ్గురి ప్రతిభ కథలోని నీరసత్వాన్ని కప్పిపుచ్చి, చిత్రాన్ని చూసేట్టు చేస్తుంది.

కథ ఎంత పాతదైనా దాన్ని గురించి కొంతైనా తెలుసుకోవాలి కదా!

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

ఫైవ్ స్టార్ హోటల్ ప్రొప్రయిటరు (మహేష్ ఆనంద్) హోటలుకు ఎదురుగా వున్న కాలనీలోని గుడిశెలను ఖాళీ చెయించి ఆ స్థలాన్ని చదును చేయించి ఆ హోటలుకు మంచి అందాన్ని కూర్చాలను కుంటాడు. అమ్మాజీ (జయచిత్ర) అనే గయ్యాళి నాయకురాలి సహాయంతో గుడిశెలు పీకించేందుకు రౌడీలను పంపుతాడు. జట్కా వాలాగా బ్రతుకు పొగిస్తున్న రాజా (నాగార్జున) అనే బుల్లోడు అందుకు ప్రతీకారంగా అమ్మాజీ మనవరాలైన పాపాజీని (రమ్యకృష్ణ) కిడ్నాప్ చేస్తాడు. దాంతో పాపాజీ తండ్రి కలెక్టరుగా వున్న రఘురాం (మురళీ మోహన్) రాజాను దండించాలని వస్తాడు. అక్కడ తన తల్లి శారదను (జయంతి) చూస్తాడు రఘురాం. చదువుకునే రోజుల్లోనే తల్లికి దూరమయ్యాడు రఘురాం. అది ఎలా జరిగిందంటె అమ్మాజీ దుండగాలు భరించలేక రఘురాం తండ్రి (నూతన్ ప్రసాద్) ఆత్మహత్య చేసుకుని చనిపోతూ రఘురాంను బాగా చదివించమని భార్య శారదకు చెప్తాడు. అంట్లుతోమైనా రఘురాంను చదివస్తానని మాట యిస్తుంది. రఘురాంను బాగా చదివించి ఐ.ఏ.ఎస్. పరీక్షకు పంపుతుంది. ఆ స్థాయిలో అమ్మాజీ డబ్బు ఖర్చు చేసి రఘురాంను వలలో బంధిస్తుంది. ఇల్లరికపు అల్లుడుగా చేసుకుంటుంది. అతని ఇంటి పేరు మార్చి తన ఇంటి పేరు పెట్టుంది.

రఘురాం అక్కడే కలెక్ట రవుతాడు. అమ్మాజీ చేతిలో కీలుబొమ్మ అవుతాడు. ఆమె పెట్టమన్న పైలు మీద అతను సంతకం పెట్టాడు. ఆమె ఆ విధంగా బాగా డబ్బు గడిస్తుంది. శారద కూతురు కొడుకే జట్కా రాజా. రఘురాం శారద కొడుకు అని తెలుసుకున్న జట్కా రాజా అతనిలో మార్పు సాధిస్తాడు. అహంకారిగా వున్న అమ్మాజీలో కూడా మార్పు సాధిస్తాడు. పొగరు బోతుగా వున్న పాపాజీని రేపు చేసినట్టు నటించి ఆ తర్వాత పెళ్ళి చేసుకుంటాడు. చివరన ఫైవ్ స్టార్ హోటల్ యజమానికి బుద్ధి చెప్తాడు, నాలుగు తన్ని ఘరానా బుల్లోడుగా పేరు గాంచుతాడు.

కథ చాలా మెలికలు తిరిగి తిక మక పెట్టుంది. దర్శకుడు కె. రాఘవేంద్ర రావు పుణ్యాన కొన్ని దృశ్యాల్లో వినోదం, శృంగారం రంగరింపు జరగటంతో చిత్రం కాస్త నిలదొక్కుకుంది.

## ఇంటి పోరు

మొదటి పేజీ కొరవ

ఎన్టీఆర్‌కు ఒకరి సాయం అక్కర్లేదు. అఖిలాంధ్రుల అభిమానంతో ఎన్టీఆర్ ముఖ్యమంత్రి అయ్యారుతప్ప లక్ష్మీపార్వతి కృషి వల్ల కాదని హరికృష్ణ ఆ ఉత్తరంలో విశదం చేశాడు. ఇంటి పోరు రచ్చకెక్కటంతో ఎన్టీఆర్ తల బాదుకుంటున్నారు. ఇలా ఉండగా హరికృష్ణ రాజకీయాల్లో జెట్ స్పీడుతో దూసుకు రావటం ఎన్టీఆర్ పెద్ద కొడుకు జయకృష్ణకు ఇష్టం లేదు. ఎన్టీఆర్ పై అలిగి చాలా కాలంగా దూరంగా ఉంటున్న జయకృష్ణ తిరిగి ఎన్టీఆర్‌కు చేరువ అవుతున్నాడట. గతంలో గుడివాడ టిక్కెట్టు అడిగి జయకృష్ణ భంగపడ్డాడు. అయితే మారిన పరిస్థితుల దృష్ట్యా తన తమ్ముడు హరికృష్ణ రాజకీయ అధికార కేంద్రం కావటంతో తన ఉనికికి ప్రమాదం కలుగుతుందని జయకృష్ణ భావిస్తున్నాడట. అందుకే జయకృష్ణ ఎన్టీఆర్‌కు దగ్గరై రాజకీయ చక్రాన్ని తన చేతుల్లోకి తీసుకోవాలను కుంటున్నాడు. లక్ష్మీపార్వతి ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని గృహఛిద్రానికి వ్యూహ రచన చేస్తోందని తెలుస్తోంది. హరికృష్ణను ఎదుర్కొనేందుకు జయకృష్ణను ముందు నిలిపి కుటుంబంలో పోరు పెడితే కాగల కార్యం నెరవేర గలదని లక్ష్మీపార్వతి భావిస్తున్నట్లు ఆమె అంతరంగికుల కథనం.

కాగా ఎన్టీఆర్ ఇంటి పోరు పట్ల చిన్నల్లుడు చంద్ర బాబు నాయుడు అమిత సంతోషంగా ఉన్నాడు. కుటుంబ కలహాలు ముదిరి అన్నదమ్ములు, అత్తమామలు కత్తులు దూసుకుంటె మధ్యే మార్గంగా అధికారాన్ని కైవసం చేసుకోవాలని చంద్రబాబు రంగుల కలలు కనేస్తున్నాడట. భవిష్యత్తులో ఎటు పోయి ఎటు వస్తుందోనని ఇప్పటి నుంచే ఎమ్మెల్యేల్ని వశం చేసుకుని తారక మంత్రాన్ని జపోసన పడుతున్నాడు. ఎమ్మెల్యే వెళ్లి ఏ పని అడిగినా కాదనకుండా యమ స్పీడుతో చేసి పెడుతున్నాడట. దాంతో ఎమ్మెల్యేలంతా యమ హ్యాపీగా ఫీలవుతున్నారు. ప్రస్తుతం సెక్రటేరియట్‌లో 'చంద్ర ది గ్రేట్' అన్న టాక్ విన్పించడానికి కారణం ఇదే.

ఇలా వుండగా కుటుంబ గొడవల్లో బాగా నష్ట పోయి దాదాపు రాజకీయంగా అనామకుడైన పెద్దల్లుడు వెంకటేశ్వర రావు 'మౌనమే నా భాష ఓ మూగ మనసా' అంటూ నోరు మెదపట్లేదు.

సినిమా
9 పేజీ కొరవ

## రామ్‌గోపాల్ వర్మ "గులాబి" ప్రారంభం

ఇప్పుడున్న సెన్సార్ మెంబర్లు మారే వరకు తాను ఇక తెలుగులో చిత్రాలు రూపొందించనని రాంగోపాల్ వర్మ శపథం పూనాడు. అంచేత, తాను దర్శకత్వం వహించకుండా తన శిష్యుడు కృష్ణ వంశీకి ఆ అవకాశం ఇచ్చాడు. అమితాబ్ బచ్చన్ కార్పొరేషన్ లిమిటెడ్ సమర్పణ గనక అమితాబ్ అండదండలతో ముందంజ వేయడానికి సిద్ధపడ్డాడు. శశిప్రీతమ్ అనే కొత్త సంగీత దర్శకుడ్ని పరిచయం చేస్తాడట. చక్రవర్తి, మహేశ్వరి, చంద్రమోహన్, బెనర్జీ స్థానిక కళాకారులు పాల్గొంటారు. ప్రారంభోత్సవాన్ని సినీ పాత్రికేయుల చేత చేయించడంతోనే రాంగోపాల్ వర్మ తెలివి తేటలు వెల్లడి అవుతున్నాయి. ఇంత వరకు ఆయన పాత్రికేయులను దూరంగా ఉంచాడు. అందుకు "శివరంజని" పత్రిక చిన్న సైజు యుద్ధం ప్రకటించింది కూడా. అందుకే ప్రారంభోత్సవం చేయడానికి సినిమా రంగ ప్రముఖులెందరో సిద్ధంగా ఉన్నా రాంగోపాల్ వర్మ పాత్రికేయులనే ఎన్నుకొన్నారు. శుభం!

### అమ్మ నా కోడలా?

ఇదొక చిత్రం పేరు. మే 24న మొదలవుతుంది. ఇందులో అమ్మ వాణిశ్రీ. వినోద్ కుమార్ హీరో. హీరోయిన్ ఎవరో ఇంకా తేలలేదు. దర్శకుడు: సాగర్. సినిమా రచయితలు చాలా సమస్యల్ని ఎదుర్కో బోతున్నారు. గత దశాబ్దంలో హీరో హీరోయిన్‌ల ఇమేజ్ అనూహ్యంగా పెరిగింది. ఈ ఇమేజ్‌ను దృష్టిలో పెట్టుకొని కథలు తయారు చేయాలంటె కొత్తదనం కరువవుతూంది. అందర్నీ నేడు పట్టుక పీడుస్తున్న సమస్య ఇదే.

### మంత్రి గారి మొగుడు

ఇది కూడా విజయశాంతి సుమన్‌ల ఇమేజ్‌లకి అనుగుణంగా అల్లిన కథ. వెరైటీ అయిన "మంత్రి గారి మొగుడు" అనే టైటిల్‌ని పెత్తే ప్రేక్షకులను బాగా ఆకర్షిస్తుందని నిర్మాత ఎన్. వెంకటేశ్వర రావు డైరక్టర్ శరత్ ఆశ.

## నిష్క్రమించిన నెల్లూరీయుడు మహానటుడు 'రక్తకన్నీరు' నాగభూషణం



"దేనికైనా టైమ్ రావాలయ్యా!" నాగ భూషణం ఎక్కువగా ఉపయోగించే వాక్యం.

సెటైర్ మాట్లాడ్డంలో, చాప కింద నీరులా జారే పాత్రలు నిర్వహించడంలో తనకు తానే సాటి అనిపించుకున్నారు.

స్కూల్లో, కాలేజీలో చదివే రోజుల్లో నాటకాలాడాడు. రైల్వే ఉద్యోగం చేస్తున్నప్పుడూ నాటకాలు ఆడాడు. నాటక రంగం నుంచి సినిమా రంగం కొచ్చిన ఏ నటుడూ చెయ్యలేని పనిని ఒక్క నాగభూషణమే చేశాడు. వర్షాకాలం తప్ప మిగతా కాలం ప్రతి నెలా మొదటి వారంలో పలు గ్రామాలలో, నగరాలలో నాటకాలు ఆడుతూ దాదాపు 30 మంది కళాకారుల కుటుంబాలను నాటక కళ ద్వారా పోషించాడు. ఒక్క "రక్తకన్నీరు" నాటకాన్నే దాదాపు అయిదు వేల ప్రదర్శనలు ఇచ్చారు. ఒకేసారి వరుసగా పదిహేను రోజుల పాటు ప్రతి రోజూ ప్రదర్శించారు. ఒక నెలలో 30 ప్రదర్శనలూ ఇచ్చారు. ఒకే రాత్రి రెండు ప్రదర్శనలూ ఇచ్చారు. ఆయనకు లభించినన్ని సత్కారాలు, గౌరవాలు ఏ కొద్ది మందికో గాని లభించవు.

1956లో విడుదలైన "ఏది నిజం" చిత్రంతో నాగభూషణంలోని నిజమైన నటుడికి గుర్తింపు లభించింది. "పల్లెటూరు, అర్ధాంగి, అమర సందేశం, మంచి మనసులు, మూగ మనసులు, పెత్తందార్లు" వగైరా ఎన్నో చిత్రాలలో ఆయన మార్క్ డైలాగ్ డెలివరీ బాక్సాఫీస్ ఆమోద ముద్ర పొందింది. జీవితం మీద, వ్యక్తుల మీద, మందు మీద, రాజకీయాల మీద స్పాట్‌లో జోక్ వేయగల దిట్ట. వామపక్ష భావాలను జీర్ణించుకున్న వ్యక్తి.

కొన్ని చిత్ర నిర్మాణ సంస్థలతో పరోక్షమైన సంబంధం కలిగిన నాగభూషణం "నాటకాల రాయుడు" చిత్రంలో ఎక్కువ బాధ్యత వహించాడు. "రక్తకన్నీరు, బికారి రాముడు, ఒకే కుటుంబం" ఆయన నిర్మించిన ఇతర చిత్రాలు.

ఆయన స్థాయి పాత్రలను కొత్తగా పరిశ్రమ ఇవ్వలేక పోయేసరికి ఆయన సినిమా రంగానికి 'గుడ్‌బై' కొట్టేశారు. అయినా ఇటీవల "నెంబర్‌వన్" చిత్రంలో నటించారు. "దేనికైనా టైమ్ రావాలయ్యా" అంటూండే నాగభూషణానికి ఇంతలోనే టైమ్ వచ్చిందా అని బాధ పడని వారెవరూ ఉండరు.

## విశ్వనాథ్ గురించి కమలహాసన్

ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం నిర్మించిన "శుభసంకల్పం" చిత్రం క్యాసెట్స్ విడుదల సందర్భంలో హీరో కమల హాసన్ ఆ చిత్ర దర్శకుడు కె. విశ్వనాథ్ గురించి ఇలా అన్నారు "ఆయనలో ఒక గొప్ప నటుడు ఉన్నాడన్న విషయం ఎప్పుడో నాకు తెలుసు. కళాకారుల నుంచి కావలసిన ఎఫెక్ట్ రాబట్టు కోవడం కోసం ఆయన పడే తపన ఇంతా అంతా కాదు. ఏ ఎస్వీ రంగారావో ధరించాల్సిన రాయుడు పాత్రను ఈ చిత్రంలో ఆయన అద్భుతంగా చేస్తూంటె, ఆయన ఇంత వరకు ఎందుకు తెర ముందు నటించలేదా అనిపిస్తుంది ఎవరికైనా అంత మహాద్భుతంగా చేశారాయన అంటూ ప్రశంసల వర్షం కురిపించారు.

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100-
అర్ధసంవత్సర చందా రూ. 50-
విడిప్రతి రూ. 2/-

Edited, Printed and Published by Nellore Dolendra Prasad at Zaminryot Press, Offset Printing at Nayagara Paper Products (I) Ltd